## సంతానసాఫల్య చికిత్సల్లో

# వైద్యంపై నమ్మకమే ప్రధాన చికిత్స

### నిరంతర ప్రయత్నం ద్వారానే విజయం

**ప్రఖ్యాత ఫెర్టిలిటీ స్పెషలిస్ట్ డాక్టర్ పద్మలత యారాశి వెల్లడి**



డాక్టర్ పద్మలత యారాశి

సంతానలోపంతో వున్నపుడు ఎక్కువగా యిరుగుపొరుగువారి అభిప్రాయాలు, స్నేహితులు, బంధువుల అభిప్రాయాలు తీవ్రమైన ప్రభావం చూపిస్తుంటాయి. అవి మానసికంగా ఎటు వెళ్లాలో తెలుసుకోలేని పరిస్థితులుంటాయి. ఎవరి ఆభిప్రాయాలలకు ప్రభావితమైనా గానీ సంతాన సాఫల్య చికిత్సల్లో వైద్యం పై నమ్మకమే ప్రధాన చికిత్స,నమ్మకంతో పాటు నిరంతర ప్రయత్నాలు ప్రభావితమైనాగానీ సంతాన సాఫల్య చికిత్సల్లో వైద్యం పై నమ్మకమే ప్రధాన చికిత్స, నమ్మకంతో పాటు నిరంతర ప్రయత్నాలు సాగించినపుడు నూటికి నూరుశాతం విజయానికి చేరువడం జరుగుతుంది. ఆధునిక వైద్యచికిత్సల ద్వారా సంతానసాఫల్యం పెద్ద కష్టం కాదు.

**సంతానలోపంతో డాక్టర్లను కలిసినపుడు ఎలాంటి పరీక్షలు చేస్తారు?**

ముందు పురుషులకు వీర్యపరీక్ష చేస్తారు. ఇందులో శుక్రకణాల సంఖ్య, చురుకుదనం బాగానే ఉంటే సరే. లేకపోతే వారం వారం వ్యవధిలో 2-3 దఫాలు మళ్ళీ అదే పరీక్ష చేసి వాటిలోనూ లోపం ఉందని నిర్ధారించుకోవటం అవసరం. మూడు పరీక్షల్లోనూ సంఖ్య తక్కువగా ఉంటే.. దానికి హార్మోన్ సమస్యలు,వెరికోసిల్ వంటి ఇతరత్రా ఏవైనా అంశాలు కారణమవుతున్నాయా? అన్నది చూడాల్సి ఉంటుంది. అప్పుడు సంఖ్య పెంచటానికి మందులు ఇవ్వవచ్చున. 6-8 వారాల్లో వాటితో కూడా ఫలితం లేకపోతే అప్పుడు ఇతర చికిత్సల గురించి ఆలోచిస్తారు. ఇక స్త్రీలకు ఎఫ్ఎస్‌హెచ్, ప్రొలాక్టిన్, థైరాయిడ్ వంటి హార్మోన్ పరీక్షలు చేస్తారు.గర్భసంచి,అండాశయాలు ఎలా ఉన్నాయో చూసేందుకు స్కానింగ్ చేస్తారు.ట్యూబులు ఎలా ఉన్నాయో తెలుసుకునేందుకు మరికొన్ని పరీక్షలు అవసరమవుతాయి. ఇవన్నీ మామూలుగా ఉన్నపుడు స్త్రీలు 30 ఏళ్ల లోపు వారైతే పెళ్లి అయి మూడేళ్లు దాటకుండా ఉంటే అండం విడుదలను ప్రేరేపించే మందులు ఇస్తారు. అండం విడుదలయ్యే సమయంలో సంభోగంలో పాల్గొనడం వంటి సూచనలిస్తారు. ఇలా 4-6 రుతుక్రామాల వరకు ప్రయత్నించినా ఫలితం లేకపోతే ఐయుఐ పద్ధతిని ఉపయోగిస్తారు. ఈ పద్ధతిలో కూడా 6 రుతుక్రమాల వరకు చూసినా ఫలితం లేకపోతే అప్పుడు ఐవిఎఫ్ ప్రక్రియ ద్వారా ప్రయత్నిస్తారు.

**సంతాన సాఫల్య చికిత్సలు ఎంతవరకు విజయవంతం అవుతాయి?**

సంతానం లేనపుడు వాటికి వైద్యచికిత్సలు చేసుకోవడానికి ప్రయత్నమే విజయానికి పునాదిగా భావించాలి. ఈ చికిత్సల్లో ప్రధానంగా చెప్పుకోవాల్సింది ఐయుఐ, ఐవిఎఫ్, ఐసిఎస్ఐ (ఇక్సీ) వీర్యాన్ని నేరుగా గర్భాశయంలో ప్రవేశపెట్టే ఐయుఐ ప్రక్రియతో 10-15 శాతం సత్ఫలితాలుంటాయి. ఇక స్త్రీ నుంచి అండాన్ని బయటికి తీసి దాన్ని శుక్రకణంతో బయటే ఫలదీకరణం చెందింది తిరిగి గర్భంలో ప్రవేశపెట్టే ఐవిఎఫ్ ప్రక్రియలో 30 శాతం ఫలితాలుంటాయి. ఆ ఫలదీకరణం చెందిచటంలో ఇక్సీ ప్రక్రియకు కూడా అనుసరిస్తే విజయవంతం అయ్యే అవకాశాలు 40 శాతం వరకు ఉంటాయి. బయట ఫలదీకరణం చెందించిన పిండకణాల్ని అదనంగా మరో 5-6 రోజులపాటా ప్రయోగశాలలోనే జాగ్రత్తగా పెంచి బ్లాస్టోసిస్ట్ దశలో గర్భాశయంలోకి ప్రవేశపెడితే విజయావకాశాలు 45 శాతం వరకు ఉంటాయి.



**శుక్రకణం.. అండాన్ని సమర్థంగా ఫలదీకరణం చెందిచాలంటే దాన్ని ప్రభావితం చేసే అంశాలేమిటి?**

వీర్యంలో తగినంత శుక్రకణాల సంఖ్య ఉండాలి. మళ్లీ వాటిలోను 20 శాతంకంటే ఎక్కువ కణాలు చురుకుగా కదులుతండాలి. వాటి ఆకృతి కూడా సరిగా ఉండటం ముఖ్యం. సామర్థ్యం కూడా ఉండాలి. కొన్నిసార్లు మిగతా అంశాలు సరిగా ఉన్నప్పటికీ ఫలదీకరణం చెందించే సామర్థ్యం లేకపోతే ఉపయోగం ఉండదు.

## • టాప్ స్టోరీస్



## • జాతీయాలు



### పుట్టు శాస్త్రి... పెట్టు శాస్త్రి!

కొందరు పండిత వంశంలో పుట్టకపోయినా పండితులే. పూర్వీకుల్లో, ఇంట్లో ఎవరు పండితులు లేకపోయినా... ఆసక్తి, కష్టం అనేవి వారిని సహజపండితుడిని చేస్తాయి.

''అబ్బ ఆయనకు ఎంత పాండిత్యమో... వారి పూర్వులలో పండితులు ఎవరైనా ఉన్నారా?''

''పండితులా పాడా... చెప్పాలంటే వారి వంశంలో ఎవరికీ చదువు రాదు. ఆయన పెట్టుశాస్త్రి'' దీంతో పాటు...

''ఏమయ్యా... పండిత కుటుంబంలో జన్మించాడు అని చెబుతున్నావు. ఈయనలో పెద్దగా సరుకు లేనట్లు ఉంది. శాస్త్రి అంటే శాస్త్రి కాదు... పుట్టు శాస్త్రి మాత్రమే'' ఇలాంటి మాటలు కూడా వినిపిస్తుంటాయి.

శాస్త్రం తెలిసిన వాడు శాస్త్రి.

**ఇంకొంచెం:**

'శాస్త్రి' పేరుతో మన దగ్గర పరీక్షలు కూడా ఉన్నాయి.

ఈ పరీక్ష పాసైన వారు పేరు చివరన 'శాస్త్రి' తగిలించుకోవచ్చు.

### ఏనుగుకు సిళ్కు చూపినట్లు...



ఏనుగుతో వ్యవహరించడం ఆషామాషీ విషయమేమీ కాదు. ఒళ్లు జాగ్రత్త పెట్టుకోవాలి.

అలాంటిది... ఏనుగుకు సిళ్కు చూపితే ఇంకేమైనా ఉందా! ఇంతకీ 'సిళ్లు' అంటే ఏమిటి? మేకలు, దున్నపోతులు... మొదలైన వాటిని బలికి తీసుకువెళ్లేటప్పుడు... ఒక రకమైన జెండాలు తీసుకువెళ్లేవాళ్లు. వీటినే 'సిళ్కు' అంటారు. వీటిని చూసి... మిగిలిన జంతువులు భయపడి చచ్చేవి. కట్టుతప్పి ప్రవర్తించేవి. చిన్న చిన్న జంతువులే ఇలా చేస్తే... ఇక ఏనుగుకు చూపిస్తే ఇంకేమైనా ఉందా? కలవరపడి బెదిరిపోయి అల్లకల్లోలం సృష్టిస్తుంది.

ముక్కోపికి అదే పనిగా కోపం తెప్పించడం కావచ్చు, ఒకరికి ఇష్టం లేని పనిని బలవంతంగా అంటగట్టి వారికి కోపం తెప్పించడం కావచ్చు, పిరికి వాళ్లకు భయపెట్టే విషయాలు చెప్పడం కావచ్చు... ఇలా రకరకాల సందర్భాల్లో ఈ జాతీయాన్ని ఉపయోగిస్తుంటారు.

### కోటికి కొడి వేశాడు!

తగిన స్థోమత లేకపోయినా ఆడంబరాలకు పోయే వారి విషయంలో 'కాసుకు గతి లేదు. కోటికి కొడి వేశాడు' అనే మాటను ఉపయోగిస్తుంటారు. పూర్వకాలంలో ఒక ఆచారం ఉండేది. కోటీశ్వరులు తమ సంపన్నతను ప్రదర్శించడానికి... ఇంటి మీద జెండాలు ఎగిరేసేవారు. ఇంటి మీద ఎన్ని జెండాలు ఉంటే అన్ని కోట్లు ఉన్నట్లు... అంత సంపన్నుడన్నమాట.

'కొడి' అంటే జెండా అని అర్థం. తమిళనాడులో ఇప్పటికీ 'కొడి'ని జెండా అనే అర్థంలోనే వాడుతుంటారు. ఇక పై మాట విషయానికి వస్తే... వెనకటికి ఎవరో బీదవాడు... 'వారిలాగా నేను మాత్రం ఇంటిపై జెండా ఎందుకు ఎగురవేయవద్దు' అనుకుంటూ అనుకున్నంత పనిచేశాడట. దీంతో ఇరుగు పొరుగువాళ్లు 'కాసుకు గతి లేదు. కోటికి కొడి వేశాడు' అని వెక్కిరించారట!



### పులి నాకినవాడు!

కొందరు ఎంత గట్టిగా పిలిచినా... అదృష్టం పలకదు. కొందరు లోస్వరంతో పిలిచినా... గట్టిగా పలుకుతుంది. అదృష్టవంతులకు, దురదృష్టవంతులకు తేడా ఇదే. అయితే... అదృష్టవంతుల్లోనూ మహా అదృష్టవంతులు ఉంటారు. వీరు పిలవకపోయినా... అదృష్టం పరుగెత్తుకు వస్తుంది. ఇలాంటి అదృష్టవంతులను 'పులి నాకినవాడు' అంటుంటారు. దురదృష్టం కొద్దీ ఎవరైనా పులి బారిన పడ్డారు అనుకోండి. ఆ పులి ఏంచేస్తుంది? సమాధానం అందరికీ తెలుసు. మరి అదే పులి... తనకు చిక్కిన మనిషిపై జాలి పడి ప్రేమగా చెయ్యి నాకితే... అంతకంటే అదృష్టవంతుడు ఎవరుంటారు మరి!




ఫన్‌డే మీద మీ అభిప్రాయాలను, సూచనలను మాకు తెలియజేయండి. ప్రియదర్శిని రామ్, ఎడిటర్, ఫన్‌డే, సాక్షి దినపత్రిక, 6-3-249/1, రోడ్ నం.1, బంజారాహిల్స్, హైదరాబాద్ - 34. funday.sakshi@gmail.com

బుక్ డిజైనింగ్: కుసుమ

• న్యూ ఫేస్

## కాకర మెరుపు

కూరగాయల్లో కాకర దివ్యౌషధం. కూర వండుకుని తిన్నా.. జ్యూస్ చేసుకుని తాగినా అనారోగ్య సమస్యలు దూరమవుతాయన్న విషయం తెలిసిందే. మరి.. చర్మానికి మెరుపునిస్తుందని, మగువల అందాన్ని రెట్టింపు చేస్తుందని మీకు తెలుసా? 'అసలే చలికాలం. శరీరమంతా పొడిబారిపోయి, కాంతివిహీనంగా మారిపోతుంది'. మరి తిరిగి మెరవాలంటే కాకరకాయతో ఫేస్ ప్యాక్ వేసుకుంటే చాలు. ట్రై చేయండి.



కాకరకాయ ముక్కలను గుజ్జుగా చేసుకుని... అందులో ఆరెంజ్ తొక్కల పొడిని (ఆరెంజ్ తొక్కలను రెండు, మూడు రోజులు ఎండలో పెడితే మిక్సీలో పొడి చేసుకోవడం ఈజీగా ఉంటుంది) కలుపుకోవాలి. ఈ మిశ్రమాన్ని ఫేస్‌కి అప్లై చేసుకుని 20 నిమిషాలు తర్వాత గోరువెచ్చని నీటితో శుభ్రం చేసుకోవాలి. ఈ ప్యాక్ శీతాకాలంలో స్క్రబ్‌లా పనిచేస్తుంది.

• కిసుక్కు



సుబ్బారావు: మీ ఆవిడ రోజూ షాపింగ్ చేస్తున్నా ఎలా ఉండగలుగుతున్నావు?
అప్పారావు: నలుగురిలో ఏడ్వనని మా ఆవిడకు ప్రామిస్ చేశాలే.

– లకనం మూర్తి, కాకినాడ

• మీకు తెలుసా



ప్రపంచంలో అత్యధిక ద్వీపాలు ఉన్న దేశం... ఇండోనేషియా.
ఈ దేశంలో 13,000లకు పైగా ద్వీపాలు ఉన్నాయి.



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

శీతాకాలం అనగానే మనల్ని ఎక్కువగా భయపెట్టేవి శ్వాసకోశ సమస్యలు. మన పరిసరాలలో లేదా మన ఇంట్లోనే ఈ తరహా అలర్జీలతో బాధ పడేవారిని చూస్తుంటాం. అందులోనూ ముఖ్యంగా 'అలర్జిక్ రైనైటిస్' బాధితులే అధికం. వీరు - తమ ఆహారపు అలవాట్లలో, జీవన విధానాలలో మార్పులు చేసుకోవడం, శీతల పానీయాలను సేవించకపోవడం వంటి ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ ఈ వ్యాధి బారిన పడుతుంటారు.




'అలర్జిక్ రైనైటిస్'కు గురి అయిన పిల్లలు స్కూలు మానివేయడం, పెద్దవారైతే ఆఫీసుకు వెళ్ళలేకపోవడం, కొందరైతే రోజువారీ దినచర్యల పరంగా కూడా తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఇతర వైద్య విధానాలలో, దీనికి కేవలం తాత్కాలిక ఉపశమనం మాత్రమే పొందవచ్చు, కానీ సరైన హోమియో చికిత్స ద్వారా, ఈ వ్యాధిని పూర్తిగా అధిగమించవచ్చు. సహజంగా మన రోగనిరోధక వ్యవస్థ జరిపే అసందర్భ ప్రతిచర్యనే 'అలర్జీ' అంటారు. అంటే మన శరీరానికి సరిపడని ఏదైనా పదార్థానికి స్పందనగా సాధారణానికి మించిన ప్రతిక్రియ జరగడం. దానికి కారణమైన పదార్థాన్ని 'అలర్జెన్' అని, అలాంటి ప్రతిచర్యను 'అలర్జిక్ రియాక్షన్' అని అంటారు.

**అలర్జిక్ రైనైటిస్ అనగా:** అలర్జెన్‌లు శ్వాస ద్వారా మన శరీరంలోకి ప్రవేశించినప్పుడు, మనలోని రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడం వలన ముక్కులోని శ్లేష్మపు పొర శోథమునకు గురికావడాన్ని వైద్యపరిభాషలో 'అలర్జిక్ రైనైటిస్' అని పిలుస్తారు. **అలర్జిక్ రైనైటిస్ 2 రకాలు.** **(1) సీజనల్ అలర్జిక్ రైనైటిస్ :** కేవలం ఒక ప్రత్యేకమైన కాలంలో మాత్రమే ఎదురుపడే అలర్జీ సమస్యను 'సీజనల్ అలర్జిక్ రైనైటిస్' అని అంటారు. పూలమొక్కల నుండి వెలువడే పుప్పొడి రేణువుల వలన ఇది ఎక్కువగా కలుగుతుంది. **(2) పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్ :** సంవత్సరం పొడవునా ఏ కాలంలోనైనా 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు గురికావటం జరిగితే - అటువంటి అలర్జీ సమస్యను 'పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్' అంటారు. దుమ్మూ-ధూళి, జంతుకేశాల వంటి అలర్జెన్‌లకు శరీరం సున్నితంగా స్పందించడం వలన ఈ తరహా రైనైటిస్ కలుగుతుంది.

**కారణాలు:** మన శరీరంలోకి ప్రవేశించిన అలర్జెన్ నుండి రక్షణ కల్పించటానికి 'హిస్టమిన్' అనే రసాయనం విడుదల కాబడి, తద్వారా అలర్జీ సమస్య ఏర్పడటంతో వెంటనే అలర్జిక్ లక్షణాలు కనిపిస్తాయి. • పూలమొక్కల నుండి వెలువడే పుప్పొడి రేణువులు, దుమ్మూ-ధూళి, బూజు, జంతుకేశాలు, వాతావరణ కాలుష్యం, వాతావరణ మార్పులు, చల్లని గాలి, సుగంధ పరిమళాలు (Perfumes), వృత్తిరీత్యా ఎదురయ్యే వాయు కాలుష్యాలు, పొగ త్రాగటం మరియు కుటుంబ చరిత్ర వంటి అంశాలన్నీ ఈ సమస్యకు గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** అధిక సంఖ్యలో తుమ్ములు రావడం, ముక్కు కారడం లేదా ముక్కు దిబ్బడ, ముక్కు మరియు కళ్ళు దురదగా ఉండటం, కళ్ళ వెంబడి నీళ్ళు కారడం, దగ్గు, గొంతులో దురదగా ఉండటం, కళ్ళచుట్టూ నల్లని వలయాలు ఏర్పడటం, తరచూ తలనొప్పి, ముఖం వాపుగా ఉండటం, నీరసం, ఒళ్ళు నొప్పులు మరియు మగతగా ఉండటం • చర్మం ఎక్కువగా పొడిబారటం - దురదగా ఉండటం మరియు చర్మంపై బొబ్బలు ఏర్పడటం వంటి 'ఎగ్జిమా' లక్షణాలను కూడా గమనించవచ్చు.

**దుష్ఫలితాలు:** చిన్న పిల్లలు తరచూ దీర్ఘకాలికంగా ఈ వ్యాధికి గురి అయినట్లయితే, అలాంటి పరిస్థితి ముఖ్యంగా ఆస్థమాకు దారి తీసే ప్రమాదం ఉంటుంది మరియు సైనసైటిస్, చెవిలో ఇన్‌ఫెక్షన్‌లు (Otitis Media), నిద్రలేమి, దంత సమస్యలకు కూడా ఇది దారి తీస్తుంది.

**నిర్ధారణ పరీక్షలు:** చాలా వరకు రోగి యొక్క లక్షణాలను బట్టి 'అలర్జిక్ రైనైటిస్'ను నిర్ధారించవచ్చు. • సి.బి.పి., ఇ.ఎస్.ఆర్. మరియు అబ్సెల్యూట్ ఇసినోఫిల్ కౌంట్ వంటి పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారిస్తారు. • Radio Allergo Sorbent Test (RAST) ద్వారా మన శరీరంలో ఒక అలర్జెన్‌కు ఎంత మేరకు IGE Antibodies ఉన్నాయో తెలుసుకోవడం ద్వారా కూడా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** పుప్పొడి రేణువులు ఎక్కువగా ఉండే కాలంలో బయటకు ఎక్కువగా వెళ్ళకపోవడం • ఉదయాన్నే ఆరుబయట వ్యాయామాలు చేయకపోవడం • బయటకు వెళ్ళి వచ్చిన వెంటనే స్నానం చేయడం • 'ముక్కు'కు మరియు 'నోటి'కి మాస్క్ ధరించటం • శీతల పానీయాలు, ఐస్‌క్రీమ్‌లు తీసుకోకపోవడం • 'దుమ్మూ-ధూళి'కి దూరంగా ఉండటం • పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం వంటి జాగ్రత్తలు తీసుకోవడం ద్వారా కొంతవరకు ఈ వ్యాధిని నియంత్రించవచ్చు

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ హోమియో చికిత్సా విధానం ద్వారా, ఎలాంటి శ్వాసకోశ సమస్యలనైనా సంపూర్ణంగా నయం చేయవచ్చు. రోగి యొక్క మానసిక-శారీరక తత్వాలను పరిగణనలోకి తీసుకున్న అనంతరం మాత్రమే ఈ కాన్‌స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ ప్రారంభించబడుతుంది. ఈ విశిష్ట చికిత్సతో శరీర రోగనిరోధక వ్యవస్థలో గల అసమతుల్యతలను సరిచేయడం ద్వారా పైన తెలిపిన అలర్జీని కలిగించే పరిస్థితులు ఎదురైనప్పటికీ, మరోసారి తిరగబెట్టని విధంగా ఈ 'అలర్జిక్ రైనైటిస్' సమస్య సంపూర్ణంగా నయం కాబడుతుంది.

# రెక్క విప్పిన కల!



'**కల**' నిజం చేసుకోవాలంటే...

ముందు 'కల' అంటూ ఒకటి కనాలి.

ఆ కలే లేకపోతే?

'కల' కనే పరిస్థితి ఊహకు కూడా అందకపోతే?!

ఈ పరిస్థితిలో మార్పు తీసుకురావడానికి చురుగ్గా పని చేస్తుంది 'ఎడ్యుకేట్ గర్ల్స్' స్వచ్ఛందసంస్థ. బడికి వెళ్లని పదిసంవత్సరాల అమ్మాయిని 'ఎడ్యుకేట్ గర్ల్స్' వాలంటీర్ ఒకరు అడిగారు...

''నీకు చదువుకునే అవకాశం వస్తే... భవిష్యత్‌లో ఏమవుతావు?'' అని.

సమాధానం... నిశ్శబ్దం! ఆ అమ్మాయి ఏమీ మాట్లాడలేదు. కొద్దిసేపటి తరువాత మాత్రం....

''ఇలా నన్ను ఎవరూ అడగలేదు. నాకు ఏం చెప్పాలో తెలియదు'' అని చెప్పింది ఆ అమ్మాయి.

'భవిష్యత్‌లో ఏం కావాలనుకుంటున్నావు?' ఇదే ప్రశ్నను బడికి వెళుతున్న అమ్మాయిని అడిగితే...

''ఆర్మీలో చేరాలనుకుంటున్నాను. ఆడవాళ్లు కూడా సైన్యంలో చేరవచ్చు అని మా టీచర్ చెప్పినప్పుడు ఆశ్చర్యపోయాను. కేవలం మగవాళ్లు మాత్రమే ఆర్మీలో చేరాలి కాబోలు అనుకునేదాన్ని'' అని చెప్పింది.

•••

రాజస్థాన్‌లోని సిరోహి జిల్లాకు చెందిన పన్నెండు సంవత్సరాల సురీలి, బడిలో ఎప్పుడూ కాలు పెట్టలేదు. వంట చేయడం, బట్టలు ఉతకడం, నీళ్లు పట్టడం, పశువులకు మేత పెట్టడం... ఇదే ఆమె ప్రపంచం. మరోవైపు చూస్తే... ఆమె సోదరుడు ఎనిమిదవతరగతి చదువుకుంటున్నాడు. ఇది సురీలి మాత్రమే కాదు... మన దేశంలో లక్షలాది బాలికల దీన జీవనచిత్రం. ఆడపిల్ల అంటే... ఇంటి పనుల్లో భాగస్వామ్యం చేయడం, పెళ్లీడు వచ్చాక పెళ్ళి చేయడం... ఇక తమ బాధ్యత తీరింది అనుకోవడం... ఇలా కొద్ది మంది తల్లిదండ్రులు ఆలోచించబట్టే... చాలామంది ఆడపిల్లలు బడి గడప తొక్కలేకపోతున్నారు. కల కనడానికి సైతం నోచుకోలేకపోతున్నారు.

సురీలిలాగే ఇంకా చాలామంది బాలికలకు తాము ఏం కోల్పోతున్నామో తెలియదు.

వారికి చదువు ప్రాముఖ్యత గురించి చెప్పేవారు కూడా ఎవరు లేరు.

'ఎడ్యుకేట్ గర్ల్స్' ఆ లోటును పూరిస్తుంది.

బడికి దూరం అయిన, అవుతున్న ఆడపిల్లలను బడిలో చేర్పించడానికి, నాణ్యమైన విద్యను అందించడానికి, విద్యాపరంగా బాలురతో సమాన అవకాశం కల్పించడానికి కృషి చేస్తుంది. చదువుకు దూరమైన లక్షకు పైగా బాలికలను ఇప్పటి వరకు స్కూల్లో చేర్పించి వారి మెరుగైన భవిష్యత్ కోసం కృషి చేస్తుంది 'ఎడ్యుకేట్ గర్ల్స్'.

''ఎన్నో వెనకబడిన ప్రాంతాల్లో, మారుమూల గ్రామాల్లో పని చేశాను. అయితే... ఒక్క బాలిక కూడా... నేను బడికి వెళ్లను అని చెప్పలేదు. చదువు పట్ల వారి ఆసక్తి కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. ఇది మాకు ఎంతో స్ఫూర్తి దాయకంగా నిలిచింది. మమ్మల్ని మరింత ఉత్సాహవంతంగా ముందుకు నడిపించడానికి తోడ్పడుతుంది'' అంటున్నారు 'ఎడ్యుకేట్ గర్ల్స్' వ్యవస్థాపకురాలు సఫీనా హుసేన్.

'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ గ్రాడ్యుయేట్' అయిన సఫీనా సౌత్ అమెరికా, ఆఫ్రికాలలో పనిచేశారు. ఇండియాకు తిరిగివచ్చిన తరువాత... ఆడపిల్లల చదువు గురించి ప్రత్యేక శ్రద్ధ పెట్టి 'ఎడ్యుకేట్ గర్ల్స్' స్థాపించారు. మాటల ద్వారా మాత్రమే కాదు... డాక్టర్, ఇంజనీర్, ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకర్, మ్యూజిషియన్... ఇలా రకరకాల పోస్టర్ల ద్వారా పిల్లలు తమదైన ఒక లక్ష్యం ఏర్పర్చుకునే దిశలో ప్రయత్నిస్తుంది 'ఎడ్యుకేట్ గర్ల్స్'

చదువు అనేది ఆడపిల్లల స్వీయ అభివృద్ధికి మాత్రమే కాదు... కుటుంబానికి, సమాజానికి, జాతికి కూడా ఎంతో ఉపయోగపడుతుందనే వాస్తవాన్ని నలుదిశలా ప్రచారం చేస్తుంది 'ఎడ్యుకేట్ గర్ల్స్'. •












# హెపటైటిస్ వైరస్ హోమియోతో మాయం

**నా పేరు** ప్రభాకర్. నా వయస్సు 35 సంవత్సరాలు. ఆరు నెలల క్రితం నేను చావు అంచుల వరకు వెళ్లొచ్చాను. ఏం జరిగిందంటే.... నీరసంగా ఉండేది. ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. ఊర్లో తెలిసిన డాక్టర్‌కు చూపిస్తే ఏవో మందులు రాసిచ్చాడు. వారం రోజులు వాడినా కొద్దిగా కూడా ఫలితం లభించలేదు. ఈలోగా కళ్లు పసుపు రంగులోకి మారుతున్నాయన్న విషయాన్ని స్నేహితులు, కుటుంబసభ్యులు గమనించి చెప్పారు. దాంతో టౌన్‌కి వెళ్లి డాక్టర్‌కు చూపించాను. అక్కడ పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని, కామెర్లు వచ్చాయని చెప్పారు. హెపటైటిస్ వైరస్ ప్రాణాంతకం అని, కాలేయం పాడయిపోతుందని చెప్పేసరికి నాలో ఆందోళన మరింత రెట్టింపు అయింది. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

**చికిత్స తరువాత :** హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. మామూలుగా ఆహారం తీసుకోవడం మొదలు పెట్టాను.. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ తెలుసుకునేందుకు పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. జీవితం ముగిసిపోతుందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది.

# హెచ్ఐవి, హెర్పిస్‌ల బాధ పోయింది

**మా ఊరు** రాజమండ్రి. నా పేరు రాజేష్. ఏడాది క్రితం ఆత్మహత్యకు ప్రయత్నించాను. అదృష్టం కొద్దీ బతికి బయటపడ్డాను. నా కథ ఏంటంటే ఒకరోజు స్నేహితుల బలవంతంపైన ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తరువాత కొద్ది నెలలకు పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు వచ్చాయి. విపరీతంగా దురద పెట్టేది. ఆ నీటి పొక్కులు పగిలి పుండు మాదిరిగా అయ్యేవి. డాక్టర్‌ను కలిస్తే కొన్ని పరీక్షలు చేసారు. ఆ పరీక్షలో నాకు హెచ్ఐవి ఉందని నిర్ధారణ అయింది. ఆ నీటిపొక్కులకు కారణం హెర్పిస్ అని తేలింది. ఆ రోజు ఎంత ఏడ్చానో చెప్పలేను. ఇక నా జీవితం ముగిసిపోయిందని నిర్ధారణకు వచ్చేశాను. ఆ సమయంలోనే డాక్టర్‌గారి ఆర్టికల్స్‌ను ఆంధ్రజ్యోతిలో చదివాను. ఆలస్యం చేయకుండా డాక్టర్‌గారిని కలిసాను. నా పరిస్థితి మొత్తం వివరిస్తే భయపడాల్సిన అవసరం లేదని, వ్యాధి గురించిన వివరాలన్నీ చెప్పారు. దాంతో నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆరు నెలల పాటు మందులు వాడితే హెర్పిస్ జాడలేకుండా పోతుందన్నారు. హెచ్ఐవి వైరస్ ఏమీ చేయలేని స్థితిలోనే ఉండిపోతుందన్నారు. డాక్టర్‌గారుచెప్పినట్లుగా మందులు వాడాను. మూడు నెలలో హెర్పిస్ పూర్తిగా పోయింది. నాకు పునర్జన్మను ప్రసాదించిన డాక్టర్‌గారికి జీవితాంతం రుణపడి ఉంటాను.

### హోమియో చికిత్స

హెచ్ఐవి, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి.





# హోమియో చికిత్సతో జీవితంలో వెలుగులు

**నా పేరు రవి**. నా పెళ్లయి నాలుగేళ్ళవుతోంది. కానీ సంతానం కలగ లేదు. మంచి మంచి ఆసుపత్రులన్నీ తిరిగాం. కానీ ఫలితం లేదు. పరీక్ష లన్నీ చేసి వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉందని అన్నారు. మందులు వాడితే సరిపోతుందన్నారు. ఏడాది పాటు మందులు వాడాను. కానీ పిల్లలు మాత్రం కలగలేదు. వీర్యకణాల సంఖ్య పెరగలేదు. ఆ సమయం లోనే హోమియో చికిత్స గురించి తెలిసింది. వెంటనే డాక్టర్ దగ్గరకు వెళ్లాను. ముందుగా సెమన్ అనాలసిస్ పరీక్ష చేయించమని చెప్పారు. రిపోర్టు వచ్చాక దానిపై అవగాహన కల్పించారు. వీర్య (సెమన్ అనాల సిస్) పరీక్ష ద్వారా వీర్యంలో ఉన్న లోపాలను గుర్తించవచ్చని అన్నారు. 'వీర్యంలో ప్రతి ఎంఎల్‌లో 60 నుంచి 120 మిలియన్ల వీర్యకణాలుండాలి. అందులో 80 శాతం కణాలు బాగుండాలి. వాటి కదలికలు బాగుండాలి. కానీ నా వీర్యంలో కణాలు తక్కువ సంఖ్యలోని ఉన్నాయి. ఉన్న కొన్ని కణాలు బాగాలేవు. అందువల్లే సంతానం కలగడం లేదు' అని డాక్టర్ చెప్పారు. హోమియో మందులతో సమస్య పోతుందని భరోసా ఇచ్చారు.

### చికిత్స తరువాత

హోమియో మందులు వాడటంతో వీర్యపుష్టి కలుగుతుందని చెబితే నమ్మలేదు. కానీ నా విషయంలో మందులు వాడిన తరువాతే అర్థమయింది. హోమియో మందులు ఎంత అద్భుతంగా పనిచేస్తాయో. హోమియో చికిత్స తరువాత వీర్యకణాల కదలికలు పెరిగాయి. డాక్టర్ గారు నా శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులు ఇచ్చారు. దీనివల్ల మంచి ఫలితం లభించింది. హోమియో చికిత్స నా జీవితంలో వెలుగులు నింపింది. ఇప్పుడు నాకు ఒక బాబు. వాడు పుట్టాక నా జీవితం మొత్తం మారిపోయింది. డాక్టర్ గారికి ఎప్పటికీ రుణపడి ఉంటాను.

# నరాల జబ్బులు శాశ్వతంగా పోవాలంటే..

**చేతులు,** కాళ్లు, పాదాలు, ముఖం, నోరు...ఇలా శరీరంలోని అన్ని భాగాల నుంచి నరాలు వెన్నుపాముతోనూ, మెదడుతోనూ అనుసంధానించబడి ఉంటాయి. ఈ నరాల వ్యవస్థ ద్వారానే భౌతిక అనుభూతుల తాలూకు సంకేతాలను మెదడుకు అందుతాయి. అంటే కాలికి దెబ్బతగిలితే నొప్పి తెలియడం వెనక కారణం మెదడుకుసంకేతాలు చేరడమే. అయితే కొందరిలో కొన్ని కారణాల వల్ల ఈ నరాల వ్యవస్థ దెబ్బతింటుంది.

**కారణాలు :** కుటుంబంలో ఎవరెనా ఈ సమస్యతో బాధపడుతున్నట్లయితే వారి పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. డయాబెటిస్‌తో బాధపడే వారిలో ఎక్కువగా కనిపించే సమస్య ఇది. గాయాలు కావడం, దీర్ఘకాలంగా అనారోగ్యం ఉండటం, ఇన్‌ఫెక్షన్లు వంటివి కూడా కారణమవుతాయి. ఆల్కహాల్ అధికంగా సేవించడం, విషపూరితమైన కెమికల్స్‌కు ఎక్స్‌పోజ్ కావడం, కొన్ని రకాల వైరస్‌లు, బ్యాక్టీరియాలు నేరుగా నరాల టిష్యూపై దాడి చేయడం వల్ల కూడా ఈ సమస్య తలెత్తవచ్చు. హెచ్ఐవితో బాధపడే వారిలోనూ పెరిఫెరల్ న్యూరోపతి డెవలప్ అయ్యే అవకాశం ఉంటుంది.

### లక్షణాలు

చేతులు, పాదాల్లో పొడిచినట్లు అనిపించడం, తిమ్మిర్లు రావడం, చేతుల్లో నుంచి వస్తువులు జారిపడటం, పురుషుల్లో అంగస్తంభనలు తగ్గిపోవడం, మలబద్ధకం, జీర్ణసమస్యలు రావడం, డయేరియా, చెమటలు అధికంగా పట్టడం వంటి లక్షణాలుంటాయి.

### హోమియో చికిత్స

నరాల సంబంధ సమస్యలకు హోమియో మందులు అద్భుతంగా పని చేస్తాయి. తిమ్మిర్లు, చెమటలు అధికంగా పట్టడం వంటివి తగ్గిపోతాయి. అంగస్తంభన సమస్యలు దూరమవుతాయి. మొత్తంగా కాంప్లికేషన్స్ అన్నీ దూరమయి ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

• నెయిల్ ఆర్ట్

# మల్టీ కలర్ నెయిల్స్

డ్రెస్ కలర్‌కు మ్యాచింగ్ నెయిల్ పాలిష్ వేసుకోవడం ప్రస్తుత ట్రెండ్. మనకు మల్టీ కలర్ డిజైన్ డ్రెస్ ఉంటే ఆ డిజైన్‌ను కూడా నెయిల్ పాలిష్‌గా వేసుకోవచ్చు.

ఈ మల్టీకలర్ నెయిల్ డిజైన్ కోసం లైట్ పింక్, డార్క్ పింక్, బ్లాక్, వైట్ కలర్ నెయిల్ పాలిష్‌లను సిద్ధం చేసుకోవాలి. తర్వాత కింద ఫొటోలో చూపించిన విధంగా స్టెప్ బై స్టెప్ వేసుకోవాలి.



1. ముందుగా గోళ్లన్నింటినీ శుభ్రం చేసుకుని అందంగా కత్తిరించుకోవాలి. తరువాత గోళ్లపై లైట్ పింక్ నెయిల్ పాలిష్ వేసుకోవాలి.
2. గోరు అంచున డార్క్ పింక్ నెయిల్ పాలిష్ కొంచెం మందంగా వేసుకోవాలి.
3. దాని కింద రెండు సన్న లైన్లు బ్లాక్ కలర్‌తో వేసుకోవాలి.
4. ఆ రెండు లైన్ల మధ్యలో బ్లాక్ కలర్‌ను నింపాలి.
5. బ్లాక్ కలర్‌పై తెల్లని నెయిల్ పాలిష్‌తో సన్న కర్వ్ గీసుకోవాలి.
6. దానిపై బేబి పింక్ కలర్ వేసుకోవాలి.

ఇదే తీరుగా మిగతా రంగులను ఉపయోగించవచ్చు. అంతే! మీ నెయిల్స్ రంగురంగులుగా మెరిసిపోతాయి. మీ కలర్ ఫుల్ డ్రెస్‌కు తగిన విధంగా మీ గోళ్ళు కూడా మ్యాచ్ అవుతాయి.

నిర్వహణ: రూనీస్ కొడవటి

---

• వాస్తు వీక్షణం

వాస్తు విద్వాన్, సాయిశ్రీ
గౌ॥డా॥ దంతూరి పండరీనాథ్



## దిగ్భ్రాన్త ద్వార దోషము

ద్వారము.. ముఖ్యంగా ప్రధాన ద్వారము ఎటువంటి దోషములేకుండా ప్రతిష్టింపబడినదై ఉండాలి. ద్వార ప్రతిష్ట సమయంలో ఎంతో జాగ్రత్త, ఓపిక, ఖచ్చితమైన పద్ధతి చాలా అవసరము. ద్వారము ప్రతిష్టింపబడినప్పుడు **'క్రింది నుండి పైకి నేరుగా (నిలువుగా) లేకుండా కాస్త ముందుకుగాని వెనుకకుగాని వంగి ఉండటము'** వలన ఏర్పడే దోషాలు అవి గలుగజేయు చెడుఫలితాల గురించి తెలుపబడ్డాయి. అంతేగాకుండా ద్వార ప్రతిష్టజేయునప్పుడు ద్వారము అడ్డముగా కూడా, నేరుగా లేకుండా ఏదైనా ఒకవైపుకు వంగి ఉండటము వలన గలుగు దోషము 'దిగ్భ్రాన్త ద్వార దోషము' అనబడుతుంది. 'దిగ్భ్రాన్తే దస్యుభిః పీడా' అని చెప్పబడినది. అంటే **ఇటువంటి దోషము గలిగిన గృహయజమానిగానీ, అందు నివసించువారు గానీ సదా చోరుల (దొంగల) వలన భయమును పొందవలసి వస్తూ ఉంటుంది.** ఒకవేళ ఎవరికైనా ఇలాంటి భయమును పొందుట పునారావృతమవుతూ ఉంటే... ఒకసారి తమ ప్రధానద్వారానికి ఇటువంటి దోషమేదైనా ఉన్నదేమోనని పరీక్షించుకొనుట ఉత్తమము. **ఒకవేళ ఈ దోషముంటే, సరిజేసుకోవటం వలన దొంగల వలన గలుగు భయము ఇట్టే దూరమవుతుంది.**

## స్వప్న భయం

**గురువు గారు, నాదో విచిత్ర సమస్య కలలో 'మలము' కనిపిస్తుంది. తర్వాత 'మలములో ఈదుతున్నట్టు' అనేక సార్లు కలలు వస్తుంటాయి. అందుకని కలలో మలము కనిపిస్తేనే భయం మొదలవుతున్నది. ఈ స్వప్నము వలన అనేక విధాలుగా కృంగిపోవలసి వస్తుంది. ఎవరికైనా చెప్తే చాలా తెలిగ్గా తీసుకోమంటున్నారు గానీ, అలా తీసుకోలేక పోతున్నాను. నిద్రకుపక్రమించే ముందే.. 'ఈ రాత్రి పడుకున్నాక ఈ కల మళ్ళీ వస్తుందేమోనన్న భయం' ఎక్కువవుతుంది. ఏం చేయాలో తోచటంలేదు. మీరేదైనా మార్గం చూపిస్తారన్న గట్టి నమ్మకంతో రాస్తున్నాను... వేరే సమస్యలేమీలేవు. అంతా బాగానే ఉంది.**

**– రాజేష్, కాకినాడ.**

మీరు చెప్పిన స్వప్నవృత్తాంతమును నిజంగానే తేలికగా తీసుకోకూడదు. స్వప్నాలు, వాటివలన గలిగే ఫలితాలను మన పూర్వీకులెప్పుడో విశ్లేషించి పెట్టారు. అందులో చాలా అరుదైన, వింతైన విషయాలనేకం ఉన్నాయి. ఆ విషయాలు తెలిస్తే మీరిలా భయపడరు. పైగా మీకొస్తున్న కల మళ్ళీమళ్ళీ రావాలని మీరే కాదు, ఈ పేజీ చదువుతున్న ప్రతి ఒక్కరూ కోరుకుంటారు. దేవతా కాలమందు వచ్చే స్వప్నాలను 'శుభస్వప్నాలు' అంటారు. అసురకాలంలో వచ్చేవాటిని 'దుస్వప్నాలు' అంటారు. కలగని నిద్రలేచాక మొత్తం కలను వివరించగలిగితే ఆ స్వప్నాన్ని 'జాగ్రత్స్వప్నము' అంటారు. కలలోని విషయం కొంతగుర్తుండి, కొంత మరిచిపోయినట్లయితే దానిని 'స్వప్నము' అంటారు. కలలోని విషయాన్ని పూర్తిగా మరిచిపోయినట్లయితే దానిని 'సుషుప్తి స్వప్నము' అంటారు. **స్వప్నశాస్త్ర విశ్లేషణ ప్రకా రం ఒక 'పేరా' ఇలా వివరిస్తుంది. కర్పూరము, తమలపాకులు, అగరు, పచ్చని పుష్పములు, చందనము దొరికినట్టు కల వస్తే 'ధనలాభం'. గంటల గడియారం గంటలుకొడుతూ కనిపిస్తే 'సంతానాభివృద్ధి' కలుగుతుంది. 'మలము'ను చూసినట్టు, త్రొక్కినట్టు, పూసుకొనినట్టు కలవస్తే 'ధనలాభం.. అంతేగాదు కార్యసిద్ధి, సౌఖ్యం కూడా కలుగుతుంది'!** ఎవరికైనా ఈ భౌతికలోకంలో ఇంకేం కావాలి!? మీకు వేరే సమస్యలు లేవని రాశారు. అందుకేకావచ్చు అంతా బాగుంది! ఇలాంటి కలలు వచ్చే అదృష్టం అందరికీ ఉండదు. ఈ అదృష్టం మీకున్నందుకు భయపడటానికి బదులు సంతోషించండి! సాయిరాం!!

**వచ్చేవారం... 'ఉద్ఘాటితకవాట వేధ'**

దంతూరివారి 'విజయవాడ-విశాఖ'లో వాస్తు పర్యటన: ఫిబ్రవరి నెల
విజయవాడ: 05, 06 ఆది, సోమ- విశాఖ: 12, 13 ఆది, సోమ

**Cell: 988 544 6501, 988 544 9458**


మీ ప్రశ్నలు పంపించవలసిన చిరునామా: వాస్తుసాయి సేవా ఆశ్రమం
వాస్తు వీక్షణం, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.

For Personal Visits & Appointments
Cell: 988 544 6501, 988 544 9458
Ph : 040 - 2781 7446, email : saisrivastu@hotmail.com

● కవర్ స్టోరీ

# మాఘమాసం మెగా విందులు

**మాఘమాసం వచ్చింది.. పెళ్లిళ్ల సీజన్ తెచ్చింది**
**మీ పెళ్లిళ్లు... మా పెళ్లిళ్లకు ఎవరొస్తారండీ బంధువులు తప్ప!**
**ఇంకొంచెం ఖర్చు పెడితే స్నేహితులు వస్తారు!**
**షారూఖ్‌ఖాన్ వస్తాడా? ఫరాఖాన్ డాన్స్ చేస్తుందా? షకీరా పాడుతుందా?**
**తోట తరణి ప్యాలెస్ వేస్తాడా? పసుపు కొట్టడానికి బంగారు రోకలి ఉంటుందా?**
**కన్యాదానం చేసేటప్పుడు కాళ్ల మీద ముత్యాలు ఒలుకుతాయా?**
**మంగళసూత్రంలో డైమండ్లు మెరుస్తాయా?**
**సినిమా ఇండస్ట్రీ అంతా దిగుతుందా? నాయకులంతా వరస కడతారా?**
**యేడాదికి సరిపోయే తిండి వడ్డించుకోగలరా?**
**పూలు యూరప్ నుంచి, పళ్లు జపాన్ నుంచి, దుస్తులు అమెరికా నుంచి దిగుమతి అవుతాయా?**
**మందు ఫ్రాన్స్‌నుంచి పారుతుందా?**
**అలాగైతేనే మాఘమాసం మెఘామాసం అవుతుంది!**
**పైసలోళ్ల పెళ్లి పెద్దోళ్ల కళ్యాణంగా మారుతుంది!**
**ఇలాంటి పెళ్లిళ్లకి జీవితంలో మనల్ని ఎవరూ పిలవరు కానీ**
**కనీసం అలాంటి వెడ్డింగ్‌కార్డ్‌ని ఎక్కడైనా చూసి సంతోషపడదాం!!**

ధనం.. విలాసాలకు చిరునామా! ఆకాశాన్ని పందిరిగా మలుస్తుంది! మబ్బులను వింజామరలను చేస్తుంది.. నక్షత్రాలతో తోరణాలు కడుతుంది.... భూదేవిని పీటలా పరుస్తుంది. సూర్యుడిని దివిటీగా వాడుతుంది. గ్రహాలను దిష్టిచుక్కలుగా పెడుతుంది. నెలవంకను వధువు జడలో తురుముతుంది. ముత్యాలను తలంబ్రాలుగా పోస్తుంది. కాసులతో దండలు అల్లుతుంది. పూలపారాణి పెడుతుంది. గాంధర్వులతో గాన కచేరి చేయిస్తుంది. అప్సరసలతో నాట్యప్రదర్శన ఇప్పిస్తుంది. ఆశీస్సులకు అతిరథ మహారథులను పిలుస్తుంది. బంగారు కానుకలు సమర్పిస్తుంది. నలభీములే నివ్వెరపోయే పంచభక్ష్యపరమాన్నాలు వడ్డిస్తుంది.

అవును ఇది డబ్బు చేసే మాయ! మయసభను మరిపించే ఆర్ట్ సెట్టింగ్‌ల మధ్య మోగే బాజాభజంత్రీలు! బిగ్ ఫ్యాట్ వెడ్డింగ్స్!

## పూలు.. పళ్లు.. బంగారు రేకులు..

పెళ్లి చూపులయిపోయి.. సంబంధం ఖాయం అయినప్పటి నుంచి మొదలవుతాయి.. ఈ వేడుకను ఘనంగా జరిపించేందుకు సన్నాహాలు. మన సంప్రదాయమూ దీన్నే వాడుకగా చేసింది. పెళ్లి తాలూకు వ్యవహారాలను పదహారు రోజులకు ఫిక్స్ చేసి! ఆ సంబరానికి నిశ్చితార్థం నాంది. దీన్నే పూలు.. పండ్లు అనీ పిలుస్తారు కొన్ని ప్రాంతాల్లో. అందుకే ఆ పూలు.. పళ్లు ఫస్ట్ ప్రయారిటీ తీసుకుంటున్నాయి ఈ పర్వంలో. పూలకు బెంగుళూరు నుంచి యూరప్ వరకూ సాగుతోంది ప్రయాణం. పళ్లకూ అంతే! సిమ్లా టు యూరప్. ఈ ఆనందానికి తీపినద్దడానికి దేశంలోని చేయితిరిగిన షెఫ్స్ హాజరవుతున్నారు. పాలు, మలాయ్, పంచదార, డ్రైఫ్రూట్స్‌తో చేసిన స్వీట్లతో నిశ్చితార్థాన్ని తీయని జ్ఞాపకంగా మిగులుస్తున్నారు. చాలా నిశ్చితార్థ వేడుకల్లో దేశీ భోజనాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. తెలుగు కుటుంబాలకు అచ్చ తెలుగు వంటకాలకే చవులూరుతున్నాయి. పులిహోర, దప్పళాలు, గారెలు, బూరెలు, పప్పు, పచ్చళ్లకే పొయ్యి

## విఘ్నేశుడికీ వైభోగమే...

ఏ శుభకార్యాన్నయినా విఘ్నేశ్వరుడి పూజతో ప్రారంభించడం ఆనవాయితీ. ఇదివరకైతే ఇది పెళ్లింటికే పరిమితమయ్యేది. మారిన కాలం దీన్నీ ఆర్భాటం చేస్తోంది. ఏ విఘ్నం కలగకుండా పెళ్లి పనులన్నీ సాఫీగా సాగిపోయేలా దీవించమని విఘ్నేశ్వరుడిని వైభోగంగా పూజిస్తున్నారు. కనీసం వంద మందికి పంక్తిలో భోజనం వడ్డిస్తున్నారు. సిమ్లా యాపిల్, చిలకలదిబ్బ తమలపాకులతో తాంబూలం ఇస్తున్నారు. ఖర్చు కోటి పై మాటే.



రాజేస్తున్నారు. ఇందులో వెరైటీలు ఘుమఘుమలాడుతున్నాయి. లాస్ట్ బట్ మోస్ట్ ఇంపార్టెంట్ థింగ్ ఈజ్ రింగ్! డైమండ్ జిలుగులకు తగ్గట్లేదు. పెరిగిన పైడి ధర, ఈ మధ్యకాలంలో మెకాలడ్డిన డిమోనిటైజేషన్ ఈ వెలుగులనేమాత్రం ప్రభావితం చేయలేకపోయాయి. లగ్న పత్రిక రాసే కార్యక్రమమూ లగ్జరీగానే సాగుతోంది. ఇదివరకైతే ఎంత ఉన్నత కుటుంబాలైనా పసుపు, కుంకుమ రాసిన కాగితం ముక్క మీద లగ్నాన్ని రాసుకునేవారు. అన్నిటికీ దర్జా వచ్చినట్టే దీనికీ వచ్చింది. బంగారు రేకుల మీద పెళ్లి ముహూర్తం ముద్రిస్తున్నారు. ఇలాంటి నిశ్చితార్థాలకు 50 కోట్లకు పైనే ఖర్చు పెడుతున్నట్లు వినికిడి.

**పసుపు దంపుడు**

విఘ్నేశ్వరుడి పూజ తర్వాత పసుపు దంపే కార్యక్రమాన్ని అంతే కన్నులపండువగా జరిపిస్తున్నారు. గతంలో అయిదుగురు ముత్తయిదువలు కలిసిచేసే ఈ సందడి ఇప్పుడో సంబరం. పసుపు దంచే రోలూ, రోకలీ బంగారు పూత అలంకారంతో పసుపుతో పాటు ఒయ్యారాన్నీ చిందిస్తున్నాయి. బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌తో రోకళ్లు జత కలుస్తున్నాయి. పడుచు పిల్లల డ్యాన్సులతో లోగిళ్లు మురుస్తున్నాయి. ఇది ఓ అయిదు కోట్ల వ్యవహారమేనట.

**పెళ్లి పత్రికలు.. అభిరుచి చిత్రికలు**

ఇందులో సృజనాత్మకతకు, ఖర్చుకి ఆకాశమే హద్దు. పెయింటింగ్ నుంచి ఛాయాచిత్రాల దాకా.. నాలుగు మూలల కార్డు ముక్క నుంచి వటపత్ర, తాళపత్ర గ్రంథం దాకా.. పాకెట్లో పట్టే సైజ్ నుంచి పెట్టెల్లో అమరే పరిమాణం దాకా చేతులకందుతున్నాయి. రకరాల డిజైన్స్‌లో.. మెటాలిక్ రంగుల్లో మెరిసిపోతున్నాయి. వీటి ఎంపికలో టేస్ట్, ఆర్ట్ మోస్ట్ ఇంపార్టెంట్ అవుతున్నాయి. పదికోట్ల రూపాయల నుంచి ఖర్చు మొదలవుతుందట.

**పెళ్లి పిలుపులు..**

దగ్గరి వాళ్లను పిలవడంలో దర్జా.. వేలువిడిచిన వాళ్లను పిలవడంలో ఆధునికతా సంతరించుకుంటున్నాయి. అయినవాళ్లను పిలవడంలో ఉన్న హంగే వేరు. పెళ్లి పత్రికతోపాటు, బంగారు చిరు కానుక, డ్రైఫ్రూట్స్ తాంబూలంతో పిలుపులు అందుతున్నాయి. ఇంకొంత మందయితే ఆహ్వానాన్ని మాట, పాట, ఆటతో ఏకంగా వీడియో తీసి పంపిస్తున్నారు. దీని ఖర్చు కనీసంగా 30 కోట్లరూపాయలు.

**సంగీత్..**

నిజానికి ఇది ఉత్తర భారత సంప్రదాయం. డబ్బు ఎల్లలను చెరిపేస్తుంది అనడానికి ఇదో ఉదాహరణ. దక్షిణాది సంపన్న కుటుంబాలూ దీన్ని దత్తత తీసుకున్నాయి. ఇప్పుడైతే మధ్యతరగతి పెళ్లి ఇళ్లూ ఈ సంగీత్ ఆలాపనను ఆలింగనం చేసుకుంటున్నాయి. పిల్లా, పెద్దా అందరూ అడుగులేసే ఆనంద సంబరం. సందడి సమయం. రిచ్ ఫ్యామిలీస్ ఇంట జరిగే పెళ్లిళ్లలోని సంగీత్ సెలబ్రేషన్స్‌లో షారూఖ్ ఖాన్, మలైకా అరోరా వంటి బాలీవుడ్ స్టార్స్ వచ్చి స్టెప్స్ వేసి అలరిస్తున్నారు. విదేశాల్లో స్థిరపడ్డ భారతీయ పారిశ్రామికవేత్తలయితే తమ పిల్లల పెళ్లిళ్ల సంగీత్‌లకు ఏకంగా పాప్‌స్టార్స్‌నే దింపుతున్నారు. సినిమా స్టార్స్‌ను పిలిచే రేంజ్ పార్టీలకయితే 30 కోట్ల వరకూ వెచ్చిస్తున్నాయట.

**మెహందీ..**

పెళ్లికి కళ తెచ్చేది చేతుల్లో పండిన గోరింట, పాదాలకు పూసిన పారాణియే కదా! అందుకే ఆధునిక భారతంలో ఇదీ ఓ వేడుకే! ఓ పాతికేళ్ల కిందటి దాకా.. గోరింటాకు కోసం ప్రత్యేకమైన సంబరం ఉండేది కాదు. పెళ్లి ముందు రోజు హడావిడిగా.. పెళ్లి కూతురి అరచేతులకు గోరింటాకు పెట్టేవారు అక్కలో, వదినలో, మరదళ్లో! ఇప్పుడలా కాదు.. మెహందీ డిజైనర్స్ వచ్చారు. ఈ డిజైన్స్ ఓ అభ్యాసం అయ్యాయి. కోర్స్‌లా మారాయి. అక్కడితో ఆగిపోలే.. నవీన కాలం గోరింటకు నవ రంగులను దిద్దుతోంది. ఎర్రటి పూతకు నల్లటి డైతో డైనింగ్ అద్దుతోంది. మధ్యలో బంగారు వర్ణాన్నీ నింపుతోంది. గోరింటాకు పెట్టడంలో సృజనాత్మకత, కళాత్మకత దేనికవే పోటీ పడుతున్నాయి. అరచేయిలోనే పూసే గోరింట ఇప్పుడు భుజాల దగ్గర నుంచి అరచేతుల నిండుగా పండి.. జఘనం మీదా వంపులు తిరిగి.. పాదాల పారాణి అవుతోంది. డిజైన్ బట్టి రేట్ నిర్ణయమవుతోంది. పెళ్లి కూతురు చేతులే కాదు.. ఆమె తాలూకు బంధువులందరి చేతులనూ ముద్దాడి రంగు పండిస్తోంది. ఇదీ పదికోట్ల రూపాయల వ్యవహారమే.

**బ్యాచ్‌లర్స్.. బ్యాచ్‌లరెట్స్ పార్టీలు**

త్వరలోనే జత కట్టబోతున్న అమ్మాయి, అబ్బాయి విడివిడిగా తమ స్నేహితులకిచ్చే పార్టీలివి. ఇదీ పాశ్చాత్య ధోరణియే. బీచ్, రిసార్ట్స్, హోటల్, టూర్.. అంటూ డెస్టినేషన్స్, కలర్, యాంబియెన్స్, డ్రెస్‌కోడ్ అంటూ థీమ్స్ ఈ పార్టీలకూ ఉన్నాయి. బిగ్ ఫ్యాట్ ఫ్యామిలీస్‌లోని వరులైతే దేశ సరిహద్దులు దాటి సీషెల్స్, మారిషస్, జమైకా వంటి తీర ప్రాంతాల్లో ఈ పార్టీలను సెలబ్రేట్ చేసుకుంటున్న దాఖలాలూ ఉన్నాయి. బ్యాచ్‌లర్స్ పార్టీలు పదేళ్ల కిందటి నుంచే హల్‌చల్ చేస్తున్నా.. వధువు తన స్నేహితులకిచ్చే బ్యాచ్‌లరెట్స్ పార్టీ ఒక అయిదేళ్ల కిందటి నుంచే ట్రెండ్‌గా మారింది. ఈ సరదా ఖరీదు పది కోట్ల రూపాయల వరకూ చేరుతోందట.

పెళ్లి





**కూతురు, పెళ్లి కొడుకు**

ప్రీ వెడ్డింగ్ సెర్మనీస్‌లో లాస్ట్ బట్ లీస్ట్ .. పెళ్లి కూతురుని, పెళ్లి కొడుకును చేయడం. కొన్ని కుటుంబాలు తమ హోదా చూపించుకోవడం కోసం సెలబ్రెటీలతో ఈ కార్యక్రమాన్నీ ఎంటర్‌టైన్ చేస్తున్నాయి. ఈ వేడుకకూ దేవలయం, కోట వంటి సెట్లను వేయిస్తున్నాయి. మొత్తమ్మీద కొన్ని కోట్ల ఖర్చుతో ఈ సంప్రదాయానికి కొత్త కళను తెప్పిస్తున్నాయి.

**పెళ్లి..**

కావ్యాల్లో వర్ణించిన, కథల్లో చెప్పిన, సినిమాల్లో చూపించిన దానికంటే వెయ్యిరెట్లు వైభవంగా జరుగుతున్నాయి. కొబ్బరాకు పందిరి అల్లేవాళ్ల స్థానంలో సినిమా ఆర్ట్ డైరెక్టర్లు వచ్చి తిరుమలను తలపించే ఆలయ సెట్లను నిర్మిస్తున్నారు. రాజస్థాన్ మహళ్లను మరిపించే ప్యాలెస్‌లకు రూపమిస్తున్నారు. గుజరాత్ కోటలను తలదన్నే క్యాజిల్స్‌ని కడుతున్నారు. ఈవెంట్ మేనేజర్లు దానికో థీమ్‌ను ఇస్తున్నారు. ఫేమస్ ఫ్లారిస్ట్‌లు వచ్చి సొబగులద్దుతున్నారు. పెళ్లి కూతురు, పెళ్లి కొడుకు కోసం పాపులర్ డ్రెస్ డిజైనర్స్ పెళ్లి వస్త్రాలను డిజైన్ చేస్తున్నారు. జ్యువలరీ డిజైనర్స్ వాళ్ల జ్యువలరీని డిసైడ్ చేస్తున్నారు. స్టయిలిస్ట్‌లు జుత్తును సరిచేస్తున్నారు. బ్రైడ్ అండ్ బ్రైడ్‌గ్రూమ్‌కి పౌడర్ అద్ది, కాటుక చుక్క దిద్దేది మేనత్తలు కాదు ప్రముఖ మేకప్ ఆర్టిస్టులు! పెళ్లి జరిపించేది ఊళ్లో పంతుళ్లు కాదు.. వేద పండితులు. ఇక ఈ పెళ్లికి అవసరమయ్యే పూలు, పళ్లు, తమలపాలకులు.. అన్నీ విదేశీవే! ఇంపోర్టెడ్ ఫ్రమ్ యూరప్ ఓన్లీ! భోజనాల దగ్గరా అసలు రాజీయే లేదు. గల్లీ ఫుడ్ నుంచి కాంటినెంటల్ దాకా అన్నీ ఉంటాయి. వచ్చినప్పటి నుంచీ వెళ్లిపోయేదాకా నోరూరిస్తూనే ఉంటాయి. ఒక్కోరకం వంటకానికి ఒక్కో షెఫ్ బృందం గరిటలు తిప్పుతుంది. శాస్త్రీయసంగీతంతో పాటు జాజ్ బ్యాండూ మిమ్మల్ని అలరిస్తుంది. క్లాసిక్‌తో పాటు క్యాజువల్ స్టెప్పులూ కనిపిస్తుంటాయి. వధూవరులకు మీరేం తెచ్చారని కాదు మిమ్మల్ని ఎంత సాదరంగా ఆహ్వానించి ఎంత ఘనంగా సాగనంపారన్నదే ఇక్కడ లెక్క. అందుకే రిటర్న్ గిఫ్ట్‌లూ పక్కాగా ఆ పెళ్లి రేంజ్‌లోనే ఉంటాయి. ఇంటికెళ్లి చూసుకుంటే అందులో బంగారమే బయటపడొచ్చు.. ముత్యమే మెరవచ్చు.. కాంజీవరం సిల్క్ సర్‌ప్రైజ్ చేయొచ్చు! ఒక్క ఈ వేడుకకే వంద నుంచి అయిదు వందల కోట్లు ఖర్చు చేస్తున్నారట.

**పోస్ట్ వెడ్డింగ్ సెర్మనీస్..**

వధువు, వరుడి ఇళ్లల్లో జరిగే సత్యనారాయణ వ్రతంతో మొదలవుతాయి. ఇంతకుముందు ఇదీ అయిన వాళ్ల మధ్యే నిరాడంబరంగా జరిగేది. ఇప్పుడు ఇదీ వేడుకే. 50 లక్షల ఖరీదు వ్యవహారం.

**రిసెప్షన్..**

అబ్బాయింట జరిగే సంబరం. అమ్మాయి ఇంట జరిగిన పెళ్లికి దీటుగా నిర్వహించే ప్రయత్నం కాబట్టి అంతే ఆడంబరంగా ఉంటోంది. పొలిటికల్ లీడర్స్, సినిమా స్టార్స్ వచ్చి సందడి చేసి వెళ్తున్నారు. ఈ రిసెప్షన్ అలంకరణలోనూ ఆర్ట్‌డైరెక్టర్ల హస్తం ఉంటోంది. వస్త్రధారణలో డ్రెస్ డిజైనర్స్ అవసరముంటోంది. జ్యువెలరీ విషయంలో జ్యువెలరీ డిజైనర్స్ జోక్యం అనివార్యమవుతోంది. సేమ్.. గల్లి టు కాంటినెంటల్ ఫుడ్ స్టాల్స్.. గాన భజానా, డాన్స్‌ల హేల.. రిటర్న్ గిఫ్ట్స్ గోల... అమ్మాయి ఇంట జరిగిన పెళ్లిని మరిపించేట్టు సాగుతోంది. దీనికీ ఓ వంద కోట్ల నుంచి ఖర్చు మొదలవుతుందట.

**పదహారు రోజుల పండుగ..**

ఇది వధువు ఇంట్లో జరిగే కార్యక్రమం. మంగళ సూత్రంలో నల్లపూసలు గుచ్చి వధువు మెడలో వేస్తారు. ఇది వరకూ దీన్నీ అయిదుగురు ముత్తయిదువులతో సరిపెట్టేవారు. ఇప్పుడూ ఊరంత పండగ చేస్తున్నారు. మంగళసూత్రం ఉత్త బంగారు తాడుతో సరిపెట్టుకోవట్లేదు. వజ్రాల జిలుగుల్నీ కోరుకుంటోంది. ఈ పదహారు రోజుల పండగతో పెళ్లి తంతంగం పూర్తయినట్టే!

గమనించాల్సిన విషయం ఏంటంటే.. ఆర్భాటానికి ఎంత ప్రాధాన్యం ఇస్తున్నారో.. సంప్రదాయానికి అంతే పీట వేస్తున్నారు. పెళ్లిలో సరదాను ఎంత కోరుకుంటున్నారో.. తంతూ అంతే శాస్త్రోక్తంగా జరిగేలా చూస్తున్నారు.

## మచ్చుకు కొన్ని బిగ్‌ఫ్యాట్ వెడ్డింగ్స్...

### 350 కోట్ల పెళ్లి



ప్రముఖ పారిశ్రామికవేత్త లక్ష్మీమిత్తల్ కూతురు వనీషాకు అమిత్ భాటియాతో 2004 లో పెళ్లయింది. వెర్సైల్స్‌లోని ఓ ప్యాలేస్‌లో అత్యంత సన్నిహితుల సమక్షంలో జరిగిన ఈ పెళ్లి ఖర్చు 350 కోట్ల రూపాయలు. ఈ పెళ్లి సంగీత్‌లో షారూఖ్‌ఖాన్, అక్షయ్‌కుమార్, కైలి, ఐశ్వర్యరాయ్, జూహి చావ్లా, సైఫ్ అలీఖాన్, రాణి ముఖర్జీలు డాన్స్ చేశారు. ఫరాఖాన్ కొరియోగ్రఫి అందించారు.

### 500 కోట్ల పెళ్లి

ఇదీ లక్ష్మీమిత్తల్ కుటుంబ సభ్యులదే. లక్ష్మీమిత్తల్ సోదరుడి కూతురు సృష్టి మిత్తల్ పెళ్లి బార్సిలోనాలోని జాతీయ మ్యూజియం 'కాటలాన్'లో జరిగింది. ఈ పెళ్లిలో విందుకోసం ఇండియా, థాయ్ ల్యాండ్‌ల నుంచి 200 మంది షెఫ్స్‌ను పిలిపించారు. 60 కిలోలున్న సిక్స్ టైర్ వెడ్డింగ్ కేక్‌ను తయారు చేయించారు.



### 10 మిలియన్ యూరోల పెళ్లి...



బ్రిటన్‌లో స్థిరపడ్డ ఇండియన్ ఇండస్ట్రియలిస్ట్ ప్రమోద్ అగర్వాల్ తన కూతురు వినీత పెళ్లిలో పాప్ స్టార్ షకీరాతో చిందేయించాడు. 2011, మేలో వెనీస్‌లోని శాన్ క్లైమెంట్ ప్యాలేస్ రిసార్ట్స్‌లో వినీతకు ముఖిత్ తేజతో ముడుముళ్లు పడ్డాయి. ఈ పెళ్లికి ప్రపంచవ్యాప్తంగా 800 మంది అతిరథమహారథులు అతిథులుగా వచ్చారు. 72 గంటలపాటు నిరవధికంగా వేడుకలు జరిగాయి. షకీరా ఆట, పాట ఈ పెళ్లికే ప్రత్యేకతను తెచ్చాయట.

## మోడర్న్ మ్యారేజెస్... రకాలు

పురాణాలు ఎనిమిది రకాల పెళ్లిళ్లను వివరించినట్టు.. ఈ మోడర్న్‌ఏజ్ కొన్ని రకాల పెళ్లిళ్లను వర్ణిస్తోంది.



**డెస్టినేషన్ మ్యారేజ్:** వీటికి నింగి, నేల, నీరే గమ్యాలు. వరల్డ్ ఫేమస్ ఐల్యాండ్స్‌లో ఈ వివాహాలు పందిరి అల్లుకుంటున్నాయి. ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన నగరాల్లో ఈ పెళ్లిళ్లకు పీటలు వేసుకుంటున్నాయి. ఆకాశంలో ప్యారాచ్యూట్ ద్వారా గాల్లో ఎగురుతూ జంటలు తలంబ్రాలు పోసుకుంటున్నాయి. చార్టర్ ఫ్లయిట్స్‌లో, హెలీకాప్టర్స్‌లోనూ జీలకర్ర బెల్లం పెట్టుకుంటున్నాయి. సముద్రగర్భంలో ఈదుతూ తాళి కట్టించుకుంటున్నాయి.

**థీమ్ అండ్ కాన్సెప్ట్ మ్యారేజెస్:** ఈకో ఫ్రెండ్లీ అని, కంప్లీట్ ట్రెడిషనల్ అని, వెజ్ థీమ్ అని ఇలా రకరకాల కాన్సెప్ట్‌లతోనూ పెళ్లిళ్లు చేసుకుంటున్నారు.

**ఫోర్ట్ మ్యారేజెస్:** అంటే రాజకోటలో పెళ్లి చేసుకోవడం. కోటలున్న ప్రాంతాలకే వెళ్లి నిజమైన కోటల్లోనే పెళ్లి చేసుకుంటున్నారు. ఇలాంటి పెళ్లిళ్ల కోసం గుజరాత్, రాజస్థాన్‌లు చాలా డిమాండ్‌లో ఉన్నాయి.



**ప్యాలేస్ మ్యారేజెస్:** ప్యాలెస్ సెట్‌లో కాకుండా నిజమైన ప్యాలేస్‌లోనే పెళ్లిళ్లు చేసుకుంటున్నారు. సల్మాన్‌ఖాన్ చెల్లెలు అర్పితాఖాన్ చేసుకుంది ఇలాంటి పెళ్లినే. హైదరాబాద్‌లోని ఫలక్‌నుమా ప్యాలేస్‌లో ఆమె పెళ్లి జరిగింది. దీనికి డిమాండ్ ఉన్న ప్లేస్ ఏంటో వేరే చెప్పక్కర్లేదు కదా! అవును రాజస్థానే.

**హోటల్ మ్యారేజెస్:** దేశ, విదేశాల్లోని సెవెన్ స్టార్ హోటల్స్ ఈ పెళ్లిళ్లకు ఆతిథ్యం ఇస్తున్నాయి.

**బీచ్ మ్యారేజెస్:** కేరళ కోవలం బీచ్ నుంచి కొంకణ్, గోవా తీరాలు దాటి యూరప్ సముద్ర తీరాలను వెదుక్కుంటూ వెళ్తున్నాయి ఈ వివాహాలు.

**టూర్ మ్యారేజెస్:** ఇందులో ఒక టూర్ ప్యాకేజ్ ఉంటుంది. పెళ్లిలోని ఒక్కో తంతును ఆ టూర్‌లోని ఒక్కో ఊళ్లో నిర్వహిస్తారన్నమాట.

పెళ్లి అయిపోయింది అన్నదాని కంటే ఎక్కడ అయింది, ఎలా అయింది అన్నదే వీళ్లకు ముఖ్యం. అందుకే ఖర్చు విషయంలో రాజీపడకుండా.. అభిరుచినే అందలమెక్కిస్తూ ఏడు సముద్రాలు దాటుతున్నారు.. ఆకాశాన్ని అంటుతున్నారు.. నీటిని చీల్చుకుంటూ వెళ్తున్నారు.




# ఈ డాన్‌బాబాతో జర భద్రం సుమా!

సోనూభాయ్‌కి టైం వేస్ట్ చేయడం అంటే ఎంతమాత్రం ఇష్టం ఉండదు. అందుకే..

'టైం వేస్టు చేయకుండా డైరెక్ట్‌గా పాయింట్‌లోకి వచ్చేస్తాను' అంటుంటాడు.

'వందేళ్లు బతకడం కాదు...అందరికీ ఉపయోగపడే పని చేసి...వారి మనసులో వేయేళ్లు బతకాలి' అని కూడా అంటాడు. ఈ డైలాగ్ విని 'ఆహా సోనూభాయిది ఎంత విశాల హృదయమో' అనుకుంటే... చాలా వేగంగా పప్పులో కాలేసినట్లే! ఎందుకంటే సోనూభాయ్‌కి ఆ క్షణంలో పప్పు కావాలంటే పప్పు కావల్సిందే...ఉప్పు కావాలంటే ఉప్పు కావాల్సిందే...వేరొకరి గుండె కావాలంటే కావాల్సిందే... రాజీ పడే సమస్యే లేదు!

'నా విషయంలో ప్రిన్సిపుల్స్ పక్కన పెట్టకపోతే ప్రాణాలు తీస్తాను' అనగలగడమే కాదు...అన్నంత పనీ చేస్తాడు.

సోనూభాయ్‌కి ఎవరో వెడ్డింగ్ కార్డు ఇవ్వడానికి వచ్చాడు. అటు చూడండి...

''వచ్చే వారం మా తమ్ముడి పెళ్లిసార్''

''తమ్ముడి పెళ్లి నెక్స్ట్ మంత్ అన్నావు కదరా''

''అంటే మీరు కూడా రావాలని...''

''అంటే... ఈలోపే నేను చనిపోతాననుకున్నావా? చనిపోతాననుకున్నావా??''

చూశారు కదా... సోనుభాయికి ఎంత క్లారిటీ ఉందో! 'ఒక్కడున్నాడు' సినిమా ద్వారా సోనూభాయ్‌గా తెలుగు వెండితెరకు పరిచయం అయిన మహేష్ మంజ్రేకర్ 'అదుర్స్' సినిమాలో 'డాన్‌బాబా'గా మరింత దగ్గరయ్యారు.


కొత్తకొత్తగా
18వ పేజీలో

●●●

మహేష్ మంజ్రేకర్‌లో నటుడు మాత్రమే కాదు, రచయిత మాత్రమే కాదు... మంచి దర్శకుడు కూడా ఉన్నాడు. 'వాస్తవ్' 'అస్తిత్వా' చిత్రాలు ఆయనకు దర్శకుడిగా మంచి పేరు తెచ్చాయి.

'కాంటే' సినిమాలో రాజు యాదవ్ బాలిగా కనిపించిన మంజ్రేకర్... ఆ పాత్ర ద్వారా 'నెగెటివ్ రోల్స్' బాగా చేయగలడు అని పేరు తెచ్చుకున్నారు. ఆస్కార్ విన్నింగ్ ఫిల్మ్ 'స్లమ్ డాగ్ మిలియనీర్'లో ఆయన చేసిన గ్యాంగ్‌స్టర్ జావెద్ పాత్ర విమర్శకుల నుంచి ప్రశంసలు అందుకుంది.

నాటకాల్లో నటించే అలవాటు ఉన్నప్పటికీ సినిమాల్లో నటించాలనే ఎప్పుడూ అనుకోలేదు మంజ్రేకర్. బ్యాంకులో ఉద్యోగంలాంటి సెక్యూర్డ్ జాబ్ ఏదైనా చేయాలనుకునేవారు. అయితే తమ పొరుగింటి వ్యక్తి జయదేవ్, మంజ్రేకర్ దృక్పథంలో మార్పు తీసుకువచ్చారు.

'వెండితెరకు నీలాంటి వాళ్ల అవసరం ఉంది' అని చెప్పారు.

మనసుకు నచ్చిన పాత్రలు రాకపోవడంతో... డైరెక్షన్ వైపు అడుగులు వేశారు మంజ్రేకర్. సంజయ్ దత్‌తో తీసిన 'వాస్తవ్' బిగ్గెస్ట్ హిట్‌గా నిలిచి దర్శకుడిగా మంజ్రేకర్‌కు ఎంతో పేరు తీసుకువచ్చింది. టబు ప్రధాన పాత్రలో వచ్చిన 'అస్తిత్వ' సీరియస్ ఫిల్మ్ మేకర్‌గా మంజ్రేకర్‌కు గుర్తింపు తెచ్చింది.

''నా పాత్రకు ఎంత ముడుతుంది. నాకు ఎంత గిట్టుబాటు అవుతుంది అనేది ఆలోచించను. దర్శకుడు చెప్పింది ఎంత వరకు చేస్తున్నాను. నా పాత్రకు వందశాతం న్యాయం చేస్తున్నానా లేదా? అని మాత్రమే ఆలోచిస్తాను'' అంటారు మంజ్రేకర్.

మంజ్రేకర్‌లోని 'బహుముఖ ప్రజ్ఞ' వల్లనేమో ఆయన నటనలో పరిణతి కనిపిస్తుంది. ఒక పాత్ర పండించడానికి...

ఆయనలో ఉన్న నటుడు, దర్శకుడు, రచయిత ఒకసారి భేటీ అవుతారేమో.

'ఇలా చేస్తే ఎలా ఉంటుంది' అని ఒకరితో ఒకరు చర్చించుకుంటారేమో... అందుకే మహేష్ మంజ్రేకర్ నటనలో ఒక కిక్ ఉంటుంది!

మరాఠీ సినిమా 'దే దక్క'ను సంజయ్‌దత్‌తో రిమేక్ చేసి 'వాస్తవ్' మ్యాజిక్‌ను మరోసారి క్రియేట్ చేయాలనుకున్నారు మంజ్రేకర్. ఆ సంగతేమిటోగానీ... ఆయన విలనిజంలోని 'మ్యాజిక్' మాత్రం దక్షిణాది ప్రేక్షకులకు పరిచయం అయింది.

'రాసి కన్నా వాసి ముఖ్యం' అనే సిద్ధాంతాన్ని నమ్ముతారు మంజ్రేకర్.

అందుకే 'సంవత్సరానికి ఎన్ని సినిమాలు వచ్చాయనేది కాదు... ఎంత మంచి సినిమాలు వచ్చాయి అనేది ముఖ్యం' అంటారు. పాత్రల ఎంపికలో కూడా ఇదే సిద్ధాంతాన్ని నమ్ముతారు. ఎన్ని పాత్రలు చేశామనేది కాకుండా...ఎంత మంచి పాత్రలు చేశామనేది ముఖ్యం అంటారు. ఆచితూచి పాత్రలు ఎంపిక చేసుకుంటారు.

అందుకే... మహేష్ వామన్ మంజ్రేకర్ మన 'ఉత్తమ విలన్' అయ్యారు.

• పురానీతి

# జడభరతుడు

ఎంతటి బ్రహ్మజ్ఞానులకైనా, విషయ వాంఛలు ఉండటం వల్ల వారు ఆ రుణాన్ని, ఆ కర్మానుబంధాన్ని తీర్చుకోవడం కోసం ఎన్నో జన్మలు ఎత్తవలసి వస్తుందనడానికి ఉదాహరణ జడభరతుని వృత్తాంతం. జడభరతుడు రుషభుడనే రాజుకు కుమారుడు. రాజపుత్రుడుగా పుట్టినా, బాల్యం నుంచి విషయ వాంఛలకు అతీతంగా, దైవభక్తి కలిగి ఉండేవాడు. అందువల్ల అతనిని జడభరతుడని పిలిచేవారు. (జడత్వం అంటే దేనికీ చలించకపోవడం అనే అర్థం ఉంది. అంతేకానీ, జడలు కలిగి ఉండటం వల్ల కాదు)

రుషభుని అనంతరం జడభరతుడు తనకు ఇష్టం లేకపోయినా, రాజ్యపాలన చేపట్టవలసి వచ్చింది. ఎన్నో సంవత్సరాలపాటు ప్రజానురంజకమైన పాలన అందించాడు. ఆయన పాలనలో ప్రజలు ఏ లోటూ లేకుండా హాయిగా ఉన్నారు. పాలన చేస్తూనే, జపధ్యానాలలో మునిగి తేలేవాడు. దేనినీ నిర్లక్ష్యం చేసేవాడు కాదు. చివరకు వృద్ధాప్యం మీదపడడంతో ఆయన పాలన బాధ్యతలను తన కుమారులకు అప్పగించి, ప్రజాజీవనానికి దూరంగా ఒక నదీతీరానికి వెళ్లి, అక్కడ ఒక పర్ణశాల నిర్మించుకుని, ప్రశాంతంగా తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. నిశ్చలమైన, నిర్మలమైన మనస్సుతో జన్మరాహిత్యాన్ని కోరి చేసే ఆయన తపస్సు శ్రీహరిని మెప్పించింది. ఇక మోక్షం అనుగ్రహించాలనుకున్నాడు. ఇంతలో జరిగిన ఒక చిత్రమైన సంఘటన భరతుడి జీవితాన్ని మలుపు తిప్పింది.

జడభరతుడికి ప్రతిరోజూ నదిలో స్నానం చేసిన తర్వాత, ఒడ్డునే కూర్చుని ధ్యానం చేసుకోవడం అలవాటు. ఒకరోజు ఆయన అలా ధ్యానానికి కూర్చున్నాడు. అదే సమయంలో నిండు చూలింత అయిన లేడి ఒకటి అక్కడ నీళ్లు తాగడానికి వచ్చింది. దానికి దగ్గరలో నుంచి ఒక పులిగాండ్రింపు వినపడింది. సరిగ్గా అప్పుడే పెద్దపెట్టున పిడుగు పడింది. ఈ రెండు సంఘటనలకు తీవ్రంగా బెంబేలెత్తిపోయింది ఆ లేడి. భయంతో వణికిపోతూ, ఒక్క గంతు వేసింది. ఆ గంతుకు లేడికి అప్పటికప్పుడు ప్రసవం జరిగిపోయింది. లేడి మాత్రం నీటిలో మునిగి చచ్చిపోయింది. దూరాన కూర్చుని ఇది గమనిస్తున్న జడభరతుడు అక్కడికి చేరుకునేలోపు అప్పుడే పుట్టిన లేడిపిల్ల కూడా నదిలో మునిగిపోతూ కనిపించింది. దాంతో ఆయన ఒక్క అంగలో దాన్ని అందుకుని, చేతుల్లోకి తీసుకున్నాడు. కళ్లు కూడా తెరవని ఆ పసిదాన్ని చూసేసరికి ఆయనలో వాత్సల్యం కలిగింది. దిక్కులేని ఆ పసికూనను కొన్నాళ్లు పెంచి, అది కాస్త పెద్దయ్యాక తిరిగి అడవిలో వదిలేద్దామనుకున్నాడు. తన పర్ణశాలకు తీసుకుని వెళ్లి, దానికి సపర్యలు చేశాడు. లేత గడ్డిపరకలు తినిపించాడు. అది కోలుకోవాలని కోరుకున్నాడు. అప్పటినుంచి తల్లి లేని దానికి అన్నీ తానే అయ్యాడు. బంగారు రంగులో మెరిసిపోతూ, అది ఆశ్రమ ప్రాంగణంలో చెంగనాలు వేస్తూ ఉంటే చూసి మురిసిపోయాడు. దాని ధ్యాసలో పడి తన తపోదీక్షను కూడా పక్కన పెట్టాడు.



సర్వసంగ పరిత్యాగి అయిన ఆ రాజర్షికి అనుక్షణం దాని ఊహే! దానితో ఆటలే! కాసేపు ఆ లేడి ఎక్కడికైనా వెళ్తే, అది తిరిగి వచ్చేవరకు ఆయన ప్రాణం విలవిలలాడేది క్రూరమృగమేదైనా దానిని పొట్టన పెట్టుకుందేమోనని. ఆటల్లో, అది యజ్ఞానికని తెచ్చుకున్న సమిధలను అపరిశుభ్రం చేస్తున్నా, దర్భగడ్డిని తొక్కిపాడుచేస్తున్నా, అదిలించేవాడు కాదు. అది కూడా భరతుడంటే ప్రాణాలు పెట్టేది. ఆయన తినిపిస్తే తప్ప పచ్చగడ్డి కూడా కొరికేది కాదు. ఓసారి ఆ లేడి ఎక్కడికో వెళ్లింది. నాలుగురోజులపాటు తిరిగి రాలేదు. ఎంత వెదికినా కనిపించలేదు. దానికి ఏమైనా అయిందేమోనని బెంగపెట్టుకుని, ఆయన జబ్బుపడ్డాడు. తనకు అంత్యసమయం వచ్చిందని గ్రహించాడు. సరిగ్గా అదే సమయంలో ఆ లేడి వచ్చి, ఆయన కాళ్లు నాకుతూ ఉండిపోయింది. దానినే చూస్తూ, తన తర్వాత దాని బాగోగులు ఎవరు చూస్తారా అనే బెంగతో ఆయన ప్రాణాలు విడిచాడు. జీవుడు చనిపోయే సమయంలో దేని గురించి ఆలోచిస్తే, ఆత్మ తిరిగి ఆ రూపం తీసుకుంటుందంటారు. జన్మరాహిత్యం కోరిన భరతుడు చివరి దశలో ఆ లేడిపిల్లను చేరదీసి, దాని ధ్యాసలో పడి మరణించడం వల్ల ఆయన అంతవరకు చేసిన తపస్సంతా వ్యర్థమై, మరుజన్మలో ఆయన లేడిగా పుట్టవలసి వచ్చింది. ఆ తర్వాత ఆయన మరో జన్మ కూడా ఎత్తవలసి వచ్చింది. అందుకే అంత్యసమయంలో భగవన్నామ స్మరణ చేయాలంటారు.



స్నాక్ సెంటర్
19వ పేజీలో

• మన దిగ్గజాలు

# స్వావలంబన స్వాప్నికుడు...

**స్వాతంత్ర్యం వచ్చిన తొలి నాళ్లలో శైశవ దశలో ఉన్న అణుశక్తికి ఉగ్గుపాలు పట్టిన శాస్త్రవేత్త ఆయన.**
**ఆధునిక సాంకేతిక ఆవిష్కరణల ఆసరగా తెలుగు గడ్డపై ఉపాధి కల్పనకు పాటుపడిన దార్శనికుడు.**
**కాకలు తీరిన వ్యాపార వేత్త కాకున్న 'ఈసీఐఎల్'ను స్థాపించి ప్రపంచ వ్యాప్తంగా బ్రాండ్ నేమ్‌ను కట్టబెట్టిన నిత్య కృషీవలుడు డా.ఎ.ఎస్.రావు.**



అంతర్జాతీయ ఎలక్ట్రానిక్ ఉత్పత్తుల విశ్వవిపణిలో ఈసీఐఎల్ స్థాపన ద్వారా భారత్ సత్తా చాటిన దార్శనికుడు అయ్యగారి సాంబశివరావు. ఈసీఐఎల్ వ్యవస్థాపకులు ఎ. ఎస్. రావుగా ఆయన అందరికి సుపరిచితులు. పశ్చిమ గోదావరి జిల్లా, మోగల్లు గ్రామంలో 1914లో ఒక నిరుపేద కుటుంబంలో జన్మించారు. తోటి విద్యార్థుల పుస్తకాలను తీసుకొని రాత్రిళ్లు వీధి దీపాల కింద చదివి పరీక్షలకి సిద్ధమయ్యేవారు. ట్యూషన్లు చెప్పిన సొమ్ము ఫీజుకు సరిపోక గుడి గంట స్తంభం దగ్గర చీకటి పడ్డాక చేయి చాచి ఆ డబ్బుతో ఫీజు కట్టి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. బి.ఎస్.సి., ఎం.ఎస్. సీ పూర్తి చేసిన బెనారస్ యూనివర్శిటీలోనే అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా నియమితులయ్యారు. 1946లో యూనివర్సిటీ ఉపకులపతిగా ఉన్న సర్వేపల్లి రాధాకృష్ణన్ సాంబశివరావు ప్రతిభను గుర్తించి పై చదువుల కోసం టాటాలకు సిఫారసు చేశారు. వారు రూ. 12 వేల ఉపకార వేతనం ఇస్తే అమెరికా వెళ్లి స్టాన్‌ఫర్డ్ యూనివర్శిటీలో చేరారు. అవి సరిపోక నెలకు 20 డాలర్ల వేతనంతో గాజు సామాను శుభ్రపరిచే పనికి, గంటకు డాలరు వేతనంతో క్యాంటీన్‌లో పనికి కుదిరారు. రెండేళ్ల తరువాత ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్‌లో డిగ్రీతో తిరిగొచ్చి హోమీ బాబా ఆశీస్సులతో ఆటమిక్ ఎనర్జీ స్టాబ్లిష్ మెంట్‌లో చేరారు. పాశ్చాత్య దేశాలు దిగ్భ్రాంతి చెందేలా ఏడాదిలో స్వదేశీ పరిజ్ఞానంతో అప్సర న్యూక్లియర్ రియాక్టర్‌ని డిజైన్ చేశారు. భారతదేశంలోనే కాక యావత్ ఆసియా ఖండంలోనే స్వదేశీ పరిజ్ఞానంతో రూపొందించిన ప్రప్రథమ రియాక్టరు ఇది.

చైనాతో యుద్ధం దరిమిలా సంభవించిన పరిణామాలతో అణు, రక్షణ పరిశ్రమలో ఎలక్ట్రానిక్స్ ప్రాధాన్యతను గుర్తెరిగిన ప్రభుత్వం 1967లో బొంబాయిలో ఎలక్ట్రానిక్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్‌ను ప్రభుత్వ రంగంలో ఏర్పాటు చేసింది. దీనికి రావు ఎండీగా ఉన్నారు. మహారాష్ట్ర, కేరళ, కర్ణాటక, తమిళనాడు డైరెక్టర్లు వారి రాష్ట్రాలకే ఎలక్ట్రానిక్స్ పరిశ్రమను తరలించేందుకు శక్తి వంచన లేకుండా కృషి చేశారు. ఇసిఐఎల్‌ను హైదరాబాద్‌కు తరలిస్తే స్థానికులకు పెద్ద ఎత్తున ఉపాధి కల్పించవచ్చని రావు భావించారు. అయితే ఈ విషయం తెలుసుకున్న బాల్‌ఠాక్రే నేతృత్వంలోని 5 వేల మంది శివసేన కార్యకర్తలు రావుగారు కార్యాలయంలో ఉండగా చుట్టుముట్టారు. ఈ పరిశ్రమను తరలించటం వల్ల మహారాష్ట్ర యువత ఉద్యోగాలను కోల్పోతుందని ఆర్థికంగా తీరని నష్టం జరుగుతుందని బాల్‌ఠాక్రే ఉద్యమం నడిపారు. రావుగారు లక్ష్యపెట్టకుండా అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ అండదండలతో ఇసిఐఎల్‌ను హైదరాబాద్‌కు తరలించారు. బొంబాయి ఆటమిక్ ఎనర్జీ ఎస్టాబ్లిష్‌మెంట్‌లో ఉన్న కొంతమంది ఇంజనీర్లను కూడా వెంటతెచ్చి సనత్‌నగర్‌లో షెడ్డులు వేసి పని నడిపించారు.

అప్పట్లో హైదరాబాద్ ప్రాంతంలో హైస్కూల్ విద్యను మాత్రమే పూర్తి చేసుకున్న యువకులను ఉద్యోగులుగా తీసుకొని ప్రపంచ స్థాయి ఉత్పత్తులను అందించటంలో రావు కార్యకుశలత అమోఘం. ఎలక్ట్రానిక్ ఉత్పత్తుల రూపకల్పన, అభివృద్ధి, తయారీ, మార్కెటింగ్ అన్ని విభాగాల్లోను స్వావలంబనే లక్ష్యంగా ఆయన శ్రమించారు. స్వదేశీ పరిజ్ఞానంతో డిజిటల్ కంప్యూటర్, దేశీ టివి, ఆటోమేటిక్ మేసేజ్ స్విచ్చింగ్ వ్యవస్థ, ఈవీఎం (ఎలక్ట్రానిక్ ఓటింగ్ మెషీన్), విమానాల్లో వాడే కాక్‌పిట్ వాయిస్ రికార్డర్‌లను దేశంలోనే తొలిసారి తయారు చేసిన ఖ్యాతి ఇసిఐఎల్‌కు దక్కటం రావు ముందు చూపుకు తార్కాణం. రక్షణ, పౌర విమానయాన, టెలి కమ్యూనికేషన్, బ్యాంకింగ్, వ్యవసాయం, ఆయిల్, విద్యుత్ రంగాలకు సంబంధించిన పలు యంత్ర పరికరాలను ఈ సంస్థ తయారు చేస్తోంది. ఇవన్నీ ఒకెత్తయితే భారతదేశపు మొదటి చంద్రమండల ప్రయోగం చంద్రయాన్, మంగళ్‌యాన్ కోసం నిర్మించిన 32 మీ. డీప్ స్పేస్ నెట్‌వర్క్ యాంటెన్నా నిర్మాణం ఇసిఐఎల్‌ను ఆకాశమంతెత్తున నిలిపింది. అంటార్కిటాకాలోని మైత్రి స్టేషన్‌లో శాట్‌కామ్ యాంటెన్నా, లడాఖ్‌లో ఖగోళ పరీక్షల కోసం నిర్మించిన 21 మీటర్ల టెలిస్కోప్ ఇసిఐఎల్ సాంకేతిక సామర్థ్యానికి మచ్చు తునకలు. చిన్న షెడ్‌లో ప్రారంభమైన కంపెనీ ఆస్తుల విలువ నేడు రూ. 2400 కోట్లకు, వార్షికాదాయం రూ. 1200 కోట్లకు చేరింది.

ఎఎస్‌రావు గారు 1978 వరకు ఇసిఐఎల్‌కు ఎండీగా ఉన్నారు. రిటైరయినప్పుడు ఎలాంటి లాంఛనప్రాయయమైన సంప్రదాయాలకూ తలవొగ్గక, రోజూలానే డ్యూటీ నుంచి ఇంటికి వెళ్లిపోవటాన్ని చూసి కార్మికలోకంతో పాటు మేనేజ్‌మెంటు కూడా అవాక్కైంది. ఇసిఐఎల్ ఉద్యోగులు ఆయన మీదున్న గౌరవంతో తాము నిర్మించుకున్న హౌసింగ్ సొసైటీకి డా. ఎఎస్‌రావు నగర్‌గా నామకరణం చేశారు. ఒక రోజు చేతి సంచితో బస్సులో వెళుతున్న రావు గారు ఎఎస్ రావు నగర్‌కు టికెట్‌కావాలన్నారు. ఆయన్ను గుర్తుపట్టిన కండక్టర్ ఆయన నిరాండంబరతను అందరికి చాటాడు. ఆయన కృషికి గుర్తింపుగా 1960లో పద్మశ్రీ, 1972లో పద్మభూషణ్ అవార్డులు వరించాయి. 2003లో ఆయన పరమపదించారు. 2014లో ఆయన నూరవ జన్మదినం సందర్భంగా ప్రభుత్వం ప్రత్యేక తపాలా బిళ్లను విడుదల చేసింది.

**- దండేల కృష్ణ**


సిగసింగారం
22వ పేజీలో

• పాటతత్వం



మాదాల రవి
నటుడు



# నాంపల్లి టేషనుకాడి...

''రూపాయి నోటుకి కొత్త రూపం వచ్చింది. కానీ.. ధనిక–పేద అంతరాలు మారలేదు! సంపాదనకి కొత్త కొత్త మార్గాలు వచ్చాయి. కానీ.. ఇతరుల కష్టాన్ని దోచుకోవాలనే కొందరి స్వార్థం మారలేదు!'' అన్నారు నటుడు మాదాల రవి. మాదాల రంగారావు, మురళీమోహన్ హీరోలుగా 'ధవళ' సత్యం దర్శకత్వంలో మాదాల రంగారావు నిర్మించిన చిత్రం 'ఎర్ర మల్లెలు'. విప్లవ చిత్రాలకి ట్రెండ్ సెట్టర్‌గా నిలిచిన ఈ చిత్రంలోని 'నాంపల్లి టేషనుకాడి..' పాటను 'ప్రజా నాట్యమండలి' ప్రభు రాశారు. ఈ పాటతత్వం గురించి మాదాల రవి మాటల్లో...

సుమారు ముప్పై ఐదేళ్ల క్రితం వచ్చిన ఈ పాట వింటుంటే... అప్పటికీ, ఇప్పటికీ పరిస్థితుల్లో పెద్ద మార్పు రాలేదనిపిస్తుంది. పాట సందర్భం ఏంటంటే.... ఓ ధనవంతుడు నాంపల్లి నుంచి ఒంగోలుకి రైల్లో వస్తాడు. అక్కణ్నుంచి ఆయన ప్రయాణం కోసం స్టేషన్ బయట ఖరీదైన కారు సిద్ధంగా ఉంటుంది. ఆ కారుని శుభ్రం చేస్తున్న కుర్రాణ్ణి చూసి జాలిపడిన వాళ్లావిడ ఏదైనా సహాయం చేయమంటుంది. అప్పుడా ధనవంతుడు కోపంతో 'నాంపల్లి స్టేషన్‌లో ఎక్కింది మొదలు ఒంగోలు దిగే వరకు ఎక్కడ చూసినా ఇలాంటోళ్లే. ఇడియట్స్! కల్చర్ పెరిగిపోయి దేశమంతా రామరాజ్యం అయిపోతుంటే.. ఇలాంటి వెధవలంతా కలసి ఆ పేరుని పాడు చేస్తున్నారు' అని వెళ్లిపోతాడు. అప్పుడీ పాట మొదలవుతుంది.

**పల్లవి:**
**నాంపల్లి టేషనుకాడి రాజాలింగో... రాజాలింగా**
**రామారాజ్యం తీరు సూడు... శివాశంభు**
**లింగా... లింగా (2)**
**నాంపల్లి టేషనుకాడి రాజాలింగో... రాజాలింగా**
**రామారాజ్యం తీరు సూడు... శివాశంభు**
**లింగా... లింగా (2)**

'ఒంగోలే కాదు.. నాంపల్లితో పాటు మన దేశమంతా ఇటువంటి పరిస్థితే ఉందా?' అని పిల్లాడు ఈ పాట అందుకుంటాడు. అప్పుడు నాంపల్లి స్టేషన్, ఇప్పుడు హైదరాబాద్ బస్ స్టేషన్, రైల్వే స్టేషన్, ట్రాఫిక్ సిగ్నల్స్... ప్రతిచోటా కారు శుభ్రం చేయడానికి వచ్చే పిల్లలు అప్పుడప్పుడూ కనిపిస్తారు.

**చరణం : తిందామంటే తిండీలేదు...**
**ఉందామంటే ఇల్లే లేదు (2)**
**చేద్దామంటే కొలువు లేదు... పోదామంటే నెలవు లేదు ॥ నాంపల్లి..॥**
**గుక్కెడు గంజి కరువైపాయే... బక్కటి ప్రాణం బరువైపాయే (2)**
**బీదబిక్కి పొట్టలు గొట్టి... మేడలు గట్టె సీకటి శెట్టి ॥నాంపల్లి..॥**

స్వాతంత్ర్యం వచ్చిన ఇన్నేళ్ల తర్వాత కూడా మనిషి కనీస అవసరాలు తిండి, ఇల్లు, ఉద్యోగం లేని ప్రజలు మన దేశంలో ఉన్నారు. టెక్నాలజీ పెరిగిన తర్వాత కొత్త కొత్త ఉద్యోగాలు వచ్చాయి. కానీ, ఇదే టెక్నాలజీని ఉపయోగించి పేదల కష్టాన్ని దోచుకుంటున్న ధనవంతుల గురించి అప్పుడప్పుడూ వార్తల్లో చదువుతూనే ఉన్నాం.




**చరణం:**
**లేని అమ్మది అతుకుల బతుకు.. ఉన్న బొమ్మకి అందం ఎరువు (2)**
**కార్లలోన తిరిగే తల్లికి కట్టే బట్ట బరువైపాయె ॥నాంపల్లి..॥**

ఈ చరణం విన్నప్పుడల్లా 'ప్రభుగారు ఎంత ముందు చూపుతో ఆలోచించారు' అనిపిస్తుంది. పాశ్చాత్య సంస్కృతి పేరుతో చిట్టిపొట్టి బట్టలు వేసుకోవడం ఇప్పటి ట్రెండ్. ఓ పక్క పేదలు చిరిగిన బట్టలకు అతుకులు వేసుకుంటుంటే.. మరోపక్క డబ్బున్నోళ్లు అందంగా ముస్తాబవడానికి వేలకు వేలు ఖర్చు పెడుతున్నారు. ఇప్పుడు ఎవర్నీ తప్పుబట్టడం లేదు. కానీ, మన భారతీయ సంస్కృతికి సుదూరంగా ప్రజలు వెళ్తున్నారనేది అక్షర సత్యం. పైగా, ఇప్పుడు బట్టలు ఎంత కురచగా ఉంటే అంత ఎక్కువ రేటు ఉంటున్నాయి.

**చరణం: ముందు మొక్కులు ఎనక తప్పులు...**
**ఉన్నవాడికే అన్నీ చెల్లును (2)**
**ఉలకావేమి పలకావేమి... బండరాయిగ మారిన సామి ॥నాంపల్లి..॥**

అప్పుడూ.. ఇప్పుడూ... వేలకోట్లకు టోపీ పెట్టేసినోళ్లు ఎక్కడైనా దర్జాగానే తిరుగుతున్నారు. పైకి దేవుడికి మొక్కుతున్నారు. వెనక తప్పులు చేస్తున్నారు. వాళ్లకు అన్నీ చెల్లుతున్నాయి. ఈ పరిస్థితులపై భగవంతుడు ఎప్పుడూ స్పందించడం లేదు! అని కుర్రాడు బాధతో పాటని ముగిస్తాడు.

ఈ పాటకి చాలా ప్రత్యేకతలున్నాయి. ప్రముఖ గాయని ఎస్పీ శైలజగారు ఈ పాటతోనే చిత్రసీమకు పరిచయమయ్యారు. తొలి పాటతోనే ఉత్తమ గాయనిగా నంది పురస్కారం అందుకున్నారామె. నేను బాల నటుడిగా పరిచయమైంది కూడా ఈ పాటతోనే. ఇందులో నేను నటించడం వెనుక జరిగిన ఓ చిత్రమైన సంఘటన గురించి చెప్పాలి. ఈ చిత్రానికి నిర్మాత నాన్నగారే కదా. పాటల రికార్డింగ్ పూర్తయిన తర్వాత క్యాసెట్ ఇంటికి తీసుకొచ్చారు. ఓసారి ఈ పాట పెట్టుకుని నేను డ్యాన్స్ చేస్తున్నాను. ఎక్కడో బయటకు వెళ్లొచ్చిన నాన్నగారు నన్ను చూశారు. పాటంతా పూర్తయిన తర్వాత నా దగ్గరికి వచ్చి మెచ్చుకున్నారు. తర్వాత సినిమాలో కూడా నా చేత నటింపజేశారు. ఒక్క రోజులోనే పాట చిత్రీకరణ పూర్తయింది. మరో విశేషం ఏంటంటే... ప్రముఖ దర్శకులు టి. కృష్ణగారు ఈ పాటకి దర్శకత్వ పర్యవేక్షణ వహించారు. ఈ పాటకి నృత్యదర్శకులు ఎవరూ లేరు. టి. కృష్ణగారితో పాటు చిత్ర దర్శకులు 'ధవళ' సత్యంగారు, చిత్రానికి కో–డైరెక్టర్‌గా పనిచేసిన బి. గోపాల్... ముగ్గురూ కలసి చిత్రీకరించారు. విడుదలైన అన్ని కేంద్రాల్లోనూ 'ఎర్ర మల్లెలు' చిత్రం సిల్వర్‌జూబ్లీ ఆడింది. సినిమాతో పాటు పాట కూడా సూపర్‌హిట్. 'ప్రజా నాట్యమండలి ప్రభుగారు రాసిన ఏకైక పాట ఇది. తెలుగులోని అత్యుత్తమ వంద పాటల్లో 'నాంపల్లి టేషనుకాడ..' పాట ఒకటని 'నేషనల్ ఫిల్మ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా' (ఎన్‌ఎఫ్‌డీసీ) పేర్కొంది.

**ఇంటర్వ్యూ: సత్య పులగం**

● కొత్తకొత్తగా



## అన్నిటినీ వండి వారుస్తుంది!

ధర: 200 డాలర్లు (రూ.13,600)

చదువుల కోసమని, ఉద్యోగాల కోసమని పిల్లలు దూరప్రాంతాలలో ఒంటరిగా ఉంటున్నారు. మెస్‌లో కాని, హోటల్స్‌లో కాని భోజనం చేస్తున్నారు. ఇలా ప్రతిరోజూ బయట తినడం వల్ల అనారోగ్య సమస్యలు తలెత్తడం మామూలే. అటువంటి వారికోసం వచ్చింది ఆటోమేటిక్ మల్టీ ఫంక్షనల్ కుకర్ – ఈ 151 రోబో కుకర్. ఇందులో వంటకు కావలసిన దినుసులన్నీ వేసి, ఆప్షన్స్ సెట్ చేస్తే, రోబోటిక్ ఫంక్షన్ ద్వారా ఆటోమేటిక్‌గా వండేస్తుంది. ఇందులో ఏ పదార్థమైనా అతిగా ఉడకదు, ముద్దలా అయిపోదు. అడుగంటదు. మాడదు. సమానంగా ఉడుకుతుంది. ఇందులోనే చికెన్, ఫిష్, నూడుల్స్, పాస్తా, సూప్... అబ్బో ఎన్ని కావాలంటే అన్ని తయారుచేసుకోవచ్చు. అతిగా ఉడకడం, మాడటం, మధ్యమధ్యలో తీసి కలియబెట్టవలసిన అవసరం లేకపోవడం వల్ల విటమిన్లు ఏమాత్రం వృథాకాకపోగా, వంట కూడా రుచిగా ఉంటుంది. ధర కూడా ఏమంత ఎక్కువ కాదు కాబట్టి, ఓసారి ప్రయత్నించి చూడొచ్చు.

## హాయిగా ఆరోగ్యంగా!

ధర: 570 డాలర్లు (రూ.39,000)

ఇంట్లో పుట్టినరోజులు, ఫంక్షన్లు వస్తే ఏ కేకు చేయాలి, ఎటువంటి కుకీస్ చేయాలి, ఎలా చేయాలి... అంటూ తర్జనభర్జన పడుతుంటారు. ఇప్పుడు ఆ బాధ లేదు. ఇంట్లోనే మనకు కావలసినవన్నీ తయారుచేసుకోవచ్చు. ఈ మిక్సర్ ఏడు రంగుల్లో దొరుకుతోంది. కిచెన్ కలర్‌కి మ్యాచ్ అయ్యేది కొనుక్కోవచ్చు. కేకులు, కుకీస్ తయారుచేసుకోవచ్చు. ఇందులో కేకులకి, కుకీలకు కావలసిన పిండి కలుపుకోవడం చాలా సులువు. దీనికుండే స్టెయిన్‌లెస్ స్టీల్ బౌల్, 300 వాట్ల డైరెక్ట్ డ్రైవ్ మోటర్, ప్లానెటరీ మిక్సింగ్ యాక్షన్, డవ్ హుక్, వ్యర్థాలను బయటకి పంపించే విస్క్ సాయంతో కేకులు, కుకీలకు కావలసిన పిండిని ఇట్టే కలుపుకోవచ్చు. మరో విషయం తెలుసా, ఇందులో పాస్తా తయారీకి కావలసిన పిండిని కూడా కలుపుకోవచ్చు. హాయిగా, ఆరోగ్యకరమైన కుకీలు ఇంటి దగ్గరే తినొచ్చు. మరి ఇంకెందుకాలస్యం!







ధర: 95 డాలర్లు (రూ.6,500)

## ఒక్క బటన్ నొక్కితే... ఇల్లంతా శుభ్రం!

తెల్లవారిందంటే ఇల్లు చిమ్మాలి. తడి వస్త్రంతో ఇల్లంతా శుభ్రంగా తుడవాలి. ఎంత కష్టపడినా, ఎన్ని సార్లు తుడిచినా మళ్లీ చెత్త, క్రిములు చేరుతూనే ఉంటాయి. దాంతో అనారోగ్యాలు తలెత్తుతాయి. వీటన్నిటికీ చెక్ పెడుతూ, మార్కెట్‌లోకి నూతన ఉత్పాదన వచ్చింది. అదే మల్టిపుల్ పర్పస్ ఫ్లోర్ స్టీమర్. ఒకే ఒక్క బటన్ నొక్కగానే, ఈ స్టీమ్ మాప్, చేతికి అనువుగా మారిపోతుంది. ఇందులో రిమూవబుల్ వాటర్ ట్యాంక్, ఒక క్లీన్ ప్యాడ్ ఉంటాయి. స్విచ్ వేయగానే, ట్యాంక్‌లోని నీళ్లు వేడెక్కుతాయి. ట్యాంక్‌లోని నీటిలో కావాలనుకుంటే ఫ్లోర్ క్లీనర్లు కలుపుకోవచ్చు లేదంటే లేదు. ఇంట్లో నేల, మూలలు, అలమరలు, స్టవ్, గోడలు, బాత్‌టబ్స్... ఎక్కడ కావాలనుకుంటే అక్కడ ఈ మల్టీ ఫంక్షనల్ మాప్‌ను ఉపయోగించవచ్చు. వేడినీరు కాబట్టి జిడ్డు గోడలకు పట్టిన జిడ్డు సులువుగా పోతుంది. దానితోబాటే క్రిములు కూడా దూరంగా పారిపోతాయి లేదా చచ్చిపోతాయి. ఆ తర్వాత క్లీన్ ప్యాడ్‌తో తడి లేకుండా చక్కగా తుడిచేస్తుంది. దాంతో 99.9 శాతం క్రిములు తొలగిపోయినట్లే. ఇందులో ఎటువంటి రసాయనాలను ఉపయోగించకుండా నేలను శుభ్రం చేయవచ్చు. బావుంది కదూ.

● కిసుక్కు



భర్త: తెల్లవారుజామున వచ్చిన కలలు నిజమవుతాయా?
భార్య: ఎందుకు ఆ డౌట్ వచ్చింది?
భర్త: నువ్వు కరాటే నేర్చుకున్నట్లు తెల్లవారుజామున కల వచ్చింది లే!

– డి.రాజేశ్వరి, వరంగల్

● మీకు తెలుసా

అలస్కాలోని అరోర ఐస్ హోటల్ పూర్తిగా మంచుతోనే నిర్మితమైంది. గోడలు, సీలింగ్, బార్... ఇలా అన్నీ మంచుతోనే నిర్మించారు.



● స్నాక్ సెంటర్



## అంజూర్ రోల్స్

**కావలసినవి:** ఖర్జూరం – ఒక కేజీ, చక్కెర – 800 గ్రా, పిస్తా – 100గ్రా బాదం – 100గ్రా, జీడిపప్పు – 100 గ్రా, నెయ్యి –కొద్దిగా, ఏలకుల పొడి – ఒక టీ స్పూను

**తయారీ:** బాదం, పిస్తా, జీడిపప్పులను చిన్న ముక్కలు చేసుకోవాలి. ఖర్జూరాలను గింజలను తీసి కొద్దిగా నీటిని పోసి ఉడికించాలి. కొంచెం చల్లారిన తర్వాత మిక్సీలో వేసి మెత్తగా గ్రైండ్ చేసుకోవాలి. ఈ పేస్టులో చక్కెర కలిపి కడాయిలో వేసి పాకం వచ్చే వరకు ఉడికించాలి. పాకం వచ్చిన తర్వాత ఏలకుల పొడి, డ్రైఫ్రూట్స్ ముక్కలన్నీ వేసి సమంగా కలిసేటట్లు కలపాలి. అంతా కలిసి ముద్దవుతుంది. చివరగా నెయ్యి వేసి కలుపుకుని పూరీల పీట మీద కాని మరేదైనా వెడల్పుగా ఉన్న పాత్రలో కాని వేసి పొడవుగా రోల్ చేసుకుని కావల్సిన సైజ్‌లో కత్తిరించాలి. ఇది ఇరవై రోజుల వరకు తాజాగా ఉంటుంది.

## డ్రైఫ్రూట్ సమోసా

**కావలసినవి:** మైదా – పావుకిలో, డాల్డా లేదా నెయ్యి – 50 గ్రా., ఉప్పు – చిటికెడు, కాజు, బాదం, కిస్‌మిస్, పిస్తా – అరకప్పు (అన్నీ కలిపి), కోవా – అరకప్పు, ఏలకుల పొడి – అర టీ స్పూన్, లెమన్ ఎల్లో కలర్ – మూడు చుక్కలు, చక్కెర – అరకేజీ, నూనె – వేయించడానికి తగినంత



**తయారీ:** జల్లించిన మైదాలో ఉప్పు, కరిగించిన డాల్డా, వాము వేసి బాగా కలపాలి. తరవాత అందులో నీరు పోసి చపాతీ పిండిలా కలుపుకుని పక్కన ఉంచాలి. కోవాను పొడిగా చేయాలి. సన్నగా కట్ చేసుకున్న డ్రైఫ్రూట్స్, సగం ఏలకుల పొడి, కలర్ వేసి కలిపి పెట్టుకోవాలి. చక్కెరలో పావు కప్పు నీళ్ల పోసి ముదురుపాకం చేసుకుని అందులో మిగిలిన ఏలకుల పొడి కలపాలి. పిండిని చిన్నచిన్న ఉండలుగా చేసి పూరీల్లా ఒత్తుకోవాలి. చాకుతో రెండు భాగాలుగా కట్ చేయాలి. ఒక భాగం తీసుకుని అంచులు తడిచేసి కోన్‌లా మడిచి చెంచాడు డ్రైఫ్రూట్స్ మిశ్రమాన్ని పెట్టి అంచులు విడిపోకుండా ఒత్తి సమోసాలా మడిచి వేడి నూనెలో బంగారురంగు వచ్చేవరకు వేయించాలి. తరవాత వీటిని పంచదార పాకంలో వేసి అరగంట ఉంచి తీసి సర్వ్ చేయాలి.

## అజ్వైన్ కుకీస్

**కావలసినవి:** బటర్ (మెత్తబడినది) – 100గ్రా., మైదా–300గ్రా, ఉప్పు – 1 టీ స్పూన్, బేకింగ్ పౌడర్ – 1 టీ స్పూన్, గుడ్లు– 2, అజ్వైన్(వాము)– 20 గ్రా, పాలు – 100 మి.లీ

**తయారీ:** మైదా, ఉప్పు, బేకింగ్ పౌడర్ కలిపి ఓ గిన్నెలో జల్లెడ పట్టాలి. దీనికి మెత్తబడిన బటర్‌ని కలుపుకోవాలి. గుడ్లను వేరుగా గిలక్కొట్టుకొని పిండి మిశ్రమానికి కలపాలి. ఇప్పుడు దీనిలో పాలు, వాము చేర్చి మళ్ళీ బాగా కలుపుకోవాలి. ఈ మిశ్రమాన్ని వెన్న రాసిన బేకింగ్ ట్రే లేదా కుకీ మౌల్డ్స్(మార్కెట్‌లో దొరుకుతాయి)లో సర్ది, 180డిగ్రీల వరకు ముందుగానే వేడి చేసుకున్న అవెన్‌లో పెట్టి, 15 నిమిషాల పాటు బేక్ చెయ్యాలి.



• టూర్‌దర్శన్ - ముక్తిథామ్

# ఆనందానుభూతుల ద్వారం... నైమిశారణ్య మార్గం

**విష్ణుభక్తులందరూ జీవితంలో ఒక్కసారైనా దర్శించాలని తహతహలాడే పుణ్య క్షేత్రం ముక్తినాథ్. ఇది హిమాలయాల్లో 3710 మీటర్ల ఎత్తులో నెలకొని ఉంది. 108 దివ్య వైష్ణవ క్షేత్రాల్లో ముక్తినాథ్ 106వ క్షేత్రం. ముక్తినాథ్ క్షేత్రాన్ని ముక్తిక్షేత్రమనీ, త్రిశూలగ్రామం అనీ పిలుస్తారు. ఈ క్షేత్ర ప్రత్యేకత ఏమిటంటే, అటు హిందువులు, ఇటు బౌద్ధులు కూడా దీనిని పవిత్ర ప్రదేశంగా భావిస్తారు. ముక్తినాథుణ్ణి ఒక్కసారి దర్శిస్తే మోక్షం వస్తుందని భక్తుల నమ్మకం. ఇక్కడికి వెళ్లాలంటే ముందుగా లక్నోకి చేరుకోవాలి. ముక్తినాథుని దర్శనానికి వెళ్లే ముందు లక్నో చుట్టు పక్కల ఉన్న కొన్ని పుణ్యక్షేత్రాలను దర్శించుకోవచ్చు. లక్నోకి సుమారు 40 మైళ్ల దూరంలో నైమిశారణ్యం ఉంది. అందువల్ల ముందుగా ఆయా పవిత్ర స్థలాలను గురించి తెలుసుకుందాం.**


దేవరాజ్ పెరుమాళ్‌గా పూజలందుకునే స్వామి

**వి**ష్ణుమూర్తి స్వయంగా వెలసిన ఎనిమిది వైకుంఠ క్షేత్రాల్లో ఇది ఒకటి. మనం భారత భాగవతాది పురాణాలలో నైమిశారణ్యం గురించి వింటూనే ఉంటాం. అంతే కాదు, 108 దివ్యదేశాల్లో ఒకటైన ఈ క్షేత్రంలో స్వామి అరణ్యరూపంలో దర్శనమిస్తాడు. ఇక్కడి ఆలయంలోని మూలవిరాట్టును దేవరాజ్ పెరుమాళ్‌గా పిలుస్తారు. ఇక్కడే చక్రతీర్థం ఉంటుంది. వలయాకారం కొలను మధ్యలో మరో వలయం లాంటి దిమ్మ ఉంటుంది. ఆ కొలనుకి దక్షిణంగా దుర్గ, రాధాకృష్ణ, వినాయకమందిరాలు ఉంటాయి. దగ్గర్లోనే మహర్షులైన వ్యాస, వైశంపాయనుల గుడులు ఉన్నాయి. వాటి ఎదుట ఉన్న పెద్ద హోమగుండంలో నిత్యాగ్నిహోత్రం వెలుగుతుంటుంది. అక్కడ పూర్వం 108 మంది రుషులు యజ్ఞం చేశారని ప్రతీతి.

**గండకీనది:** నైమిశారణ్యం దగ్గర్లోనే కాళీ గండకీనది ఉంది. ఇది చాలా లోతుగా ఉంటుంది. ఇక్కడ స్నానం చేసి దేవరాజ్ స్వామిని దర్శించుకోవాలి. పక్కనే అహోబిల మఠం ఉంటుంది. ఇక్కడ లక్ష్మీనరసింహస్వామి గుడి ఉంది. మఠం నుంచి అయిదు గంటలు ప్రయాణిస్తే అయోధ్యకు చేరుకోవచ్చు.

**రాముడి జన్మస్థానం :**

అయోధ్య సరయూ నది ఒడ్డున ఉంది. అక్కడకి దగ్గరలో రాముడు జన్మించిన ప్రదేశం ఉంది. రామమందిరానికి వెళ్లే వీధులన్నీ ఇరుకుగా ఉంటాయి. ఆలయంలో రాముడికీ సీతకీ మాత్రమే మందిరాలు ఉన్నాయి. రామజన్మభూమి ప్రాంతం భద్రతాపరమైన తనిఖీల మధ్య దర్శించుకోవాల్సి ఉంటుంది.

**ముక్తినాథుని యాత్ర:** ముక్తినాథ్ ఆలయం నేపాల్‌లోని ముస్తాంగ్ జిల్లాలో ఉంది. ఇక్కడికి వెళ్లాలంటే ముందుగా సరిహద్దు గ్రామమైన సొనాలి చేరుకోవాలి. ఇది సగం నేపాల్‌లోనూ సగం భారత్‌లోనూ ఉంది. ఇక్కడ భద్రతాపర తనిఖీలు నిర్వహిస్తారు. అక్కడ నుంచి పోఖ్రా విమానాశ్రయం చేరుకొని జమ్‌సమ్ చేరుకోవాలి. పోఖ్రా నుంచి విమానంలో ప్రయాణించేటప్పుడు మంచుకొండలు, జలపాతాలు, అగాధంలా కనిపించే లోతైన లోయలు అద్భుతంగా ఉంటాయి. జమ్‌సమ్ మంచుశిఖరాలు కనులవిందుగా అనిపిస్తాయి. జమ్‌సమ్ నుంచి ఇరుకైన దారిలో గంటన్నర ప్రయాణిస్తే రాణీపువా గ్రామం చేరుకోవచ్చు. అక్కడ మోటారు సైకిళ్ల మీద నేపాలీయులు చాలామంది ఉంటారు. బైక్‌లమీదే ముక్తినాథ్‌కు వెళ్లాలి. ఎందుకంటే అది చాలా ఇరుకైన దారి. సుమారు 20 నిమిషాలు ప్రయాణిస్తే ముక్తినాథ్‌కు చేరుకోవచ్చు. ఇక్కడ హోటళ్లు తక్కువగా, చాలా చిన్నవి ఉంటాయి. దేవాలయాన్ని చేరుకుని,


నైమిశారణ్యంలో చక్రతీర్థం


నీలకంఠ బుద్ధుడు, ఆయన శిష్యులు


కొలనులో శయనించిన శ్రీమన్నారాయణ మూర్తి


ముక్తినాథ్ సాలిగ్రామాలు


కొండకోనలలో కొలువైన ముక్తినాథుడి ఆలయం

స్వామిని సందర్శించుకోవాలంటే కనీసం 200 మెట్లు ఎక్కాలి మరి. తీరా ఆలయానికి చేరుకున్నాక, ఇంత చిన్న ఆలయమా! అని అనిపిస్తుంది కానీ, గుడి ఎంత చిన్నగా ఉన్నప్పటికీ, గర్భాలయంలో వింజామరలు వీచే శ్రీదేవి, భూదేవిలతో సహా సాక్షాత్కరించే శ్రీమన్నారాయణుని దివ్యసుందర విగ్రహాన్ని దర్శించుకునేసరికి, ఆ భావన కాస్తా ఎటో ఎగిరిపోతుంది. ఆలయ అంతరాళంలో శేషతల్పంపై పడుకుని ఉన్న విష్ణుదేవుడి విగ్రహం నయన మనోహరంగా ఉంటుంది. ఆ దివ్యమంగళ స్వరూపాన్ని దర్శించుకోగానే, మనసు వైకుంఠానికి వెళ్లిపోతుంది. తన భక్తులూ తనతో సమానం అన్నట్లుగా ఆ స్వామి మూర్తి పక్కనే ఆయనకు పరమ భక్తాగ్రేసరుడైన రామానుజుల విగ్రహం దర్శనమిస్తుంది. గుడి పక్కనే 108 గోముఖాల గుండా నీటిధారలు పడుతుంటాయి. వీటి నుంచి వచ్చే నీళ్లు చల్లగా రక్తం గడ్డ కట్టేటట్లు ఉంటాయి. గుడికి దగ్గరలో దివ్యమైన జ్వాలతో మన అజ్ఞానాంధకారాలను పటాపంచలు చేసేందుకా అన్నట్లు ఒక దివ్య జ్యోతి మినుకు మినుకుమని వెలుగుతుంటుంది. అందులో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుగా చెప్పే మూడు జ్యోతులు ఉంటాయని భక్తుల విశ్వాసం.

**శ్వేత గండకీ నది, డేవిడ్ ఫాల్స్:** పోఖ్రా నుంచి శ్వేతగండకీ నదికి వెళ్లవచ్చు. ఇక్కడ నీళ్లు పాలల్లా తెల్లగా, స్వచ్ఛంగా, తాగడానికి కొబ్బరినీళ్లలా ఉంటాయి. అక్కడికి దగ్గరలోనే డేవిడ్ ఫాల్స్ ఉన్నాయి. నీటిధారల్నీ భూమినీ ఎవరో కళాకారుడు చెక్కినంత అందంగా అక్కడ జలపాతం దూకుతూ ఉంటుంది. ఆ నీళ్లు ఎక్కడికి వెళ్తున్నాయో ఎవరికీ తెలీదు.

## ఎప్పుడు వెళ్లాలి?

**ముక్తినాథుణ్ణి సందర్శించుకోవడానికి మార్చి నుంచి జూన్ వరకు అనుకూలంగా ఉంటుంది. అంతకన్నా ముందు లేదా ఆ తర్వాత వెళ్లలేం. వొళ్లు గడ్డకట్టించే చలి పులి, అతిశీతలవాయువులు మనల్ని తరిమి తరిమి కొడతాయి. మనం ఆనందానుభూతులను పొందలేము కూడా. కాబట్టి మనకు ఎండలనుంచి ఉపశమనం కలగాలన్నా, మంచుకొండల మధ్యన మనం ఆనందాన్ని అనుభవించాలన్నా ఎండాకాలమే మంచిది.**

**పశుపతి నాథ్**

ఖాట్మండు నుంచి 12 గంటలు ప్రయాణిస్తే పశుపతి నాథుణ్ని దర్శించుకోవచ్చు. దారి మధ్యలో ఒక వైపు వాగులు మరో వైపు క్యాబేజీ కాలీఫ్లవర్ పంటపొలాలూ చూసుకుంటూ వెళ్లవచ్చు. పశుపతినాథుని ఆలయం చాలా విశాలంగా, సుందరంగా ఉంటుంది. ఆలయంలో ఈశ్వరుడు చతుర్ముఖుడు. గుడిలోపల వినాయకుడు, నర్‌నారాయణ్, శ్రీరామమందిరాలు కూడా ఉన్నాయి. పక్కనే భాగమతీనది ప్రవహిస్తుంది. ఈ నది ఒడ్డున ఘాట్‌లో దహనం చేసి నదిలో కలిపితే కాశీలో మరణించిన పుణ్యం వస్తుందని స్థలపురాణం చెబుతోంది.

**నీలకంఠ బుద్ధుడు:** నీల్‌కంఠ ఆలయం చాలా పెద్దది. గుడి మధ్యలో పెద్ద కొలను ఉంది. దాని మధ్యలోనే శ్రీమన్నారాయణుడి విగ్రహం ఉంది. అందువల్ల కొలను నీళ్లతో ప్రక్షాళన చేసుకోవడమే మహాప్రసాదంగా భావిస్తారు భక్తులు. అక్కడికి దగ్గరలో రాధాకృష్ణుడి ఆలయం ఉంది. ఇది ప్రపంచ వారసత్వ సంపదలో భాగంగా రక్షించబడుతోంది. పగోడాల్లాంటి గోపురాలు, పెద్ద సింహాలు, ఏనుగుల శిల్పాలతో పాటు నర్తన గణపతి, కాళికాంబ విగ్రహాలు చెక్కి ఉన్నాయి. రాధాకృష్ణమందిరంలో పైకప్పుపైన చెక్కిన మహాభారత ఘట్టాలు నయన మనోహరంగా ఉంటాయి. ముక్తినాథ్ యాత్రలో భాగంగా చాలా ప్రదేశాలను చూడవచ్చు. ఈ యాత్ర మనకు ఎన్నో మధుర స్మృతులను మిగులుస్తుంది.

**- డి.వి.ఆర్.భాస్కర్**

"కుదురైన కొప్పందం, చక్కని ముడి అందం" అనేది ఒకప్పటి సంగతి కదా... అనుకుంటే పొరబాటే. వాలు జడల వయ్యారాల కన్నా, రివ్వురివ్వున ఎగిరే హెయిర్ లీవ్ కన్నా... మెలిపెట్టిన ముడులే అదుర్స్ అంటున్నారు ఇప్పుడు ట్రెండ్ సెటర్స్. ఇక్కడ చూడండి, మెలితిరిగిన మోడల్ ముడిని. ఈ "హెడ్ బ్యాండ్ అప్ డూ" స్టైల్‌లో కేశాలంకరణ చేసుకుని, పార్టీవేర్ డ్రెస్ వేసుకుంటే.. వారెవ్వా అనిపిస్తుంది కదూ..




సేకరణ: సంహిత నిమ్మన

# రాప్డ్ హెడ్‌బ్యాండ్ అప్‌డూ



1 ముందుగా జుట్టు మొత్తం చిక్కులు లేకుండా దువ్వెనతో దువ్వాలి. తల ముందు భాగంలో రెండు మూడు, అంగుళాలు వదిలి ఫొటో నెంబర్ 1లో చూపించినట్లు హెయిర్ బ్యాండ్ సెట్ చేసుకోవాలి.

2 హెయిర్ బ్యాండ్‌లో ఉంచిన హెయిర్ చివర భాగంలో చిన్న రబ్బర్ బ్యాండ్ పెట్టాలి.

3 ఇప్పుడు రబ్బర్ బ్యాండ్ పెట్టిన చివరి భాగాన్ని మడతపెట్టి ముందుగా తల మొత్తానికి పెట్టిన హెయిర్ బ్యాండ్‌లోనికి పెట్టాలి.

4 బ్యాండ్‌లోకి పెట్టిన హెయిర్ ఊడిపోకుండా ఉండేందుకు హెయిర్ పిన్స్ జోడించాలి.

5 హెయిర్ బ్యాండ్ పెట్టకుండా కుడి,ఎడమ వైపుల్లో వదిలిపెట్టిన హెయిర్‌ను మరోసారి దువ్వాలి. తర్వాత కుడి వైపు లీవ్ చేసిన హెయిర్‌ను మెలివేసి కాస్త వదులుగా చేసుకోవాలి.

6 మెలి వేసిన కుడివైపు హెయిర్‌ని ముడికి చుట్టేందుకు వీలుగా ఎడమవైపుకి తిప్పాలి.

7 ఎడమ వైపుగా తిప్పిన హెయిర్‌ని కొప్పుకు చుట్టి హెయిర్ పిన్స్ పెట్టుకోవాలి.

8 ఇప్పుడు కుడివైపుని కూడా హెయిర్ మెలివేసి ఇంతకు ముందులానే కాస్త వదులుగా చేసుకోవాలి.

9 కుడివైపు నుంచి కూడా ఎడమవైపు హెయిర్‌ని చుట్టినట్లుగానే, కొప్పుకు చుట్టాలి.

10 మీ ఫంకింగ్ స్టైల్‌ను బట్టి కుడివైపు కానీ, ఎడమ వైపున కానీ పొడవాటి హెయిర్ ఫంక్ వదిలితే చాలు. అదుర్స్ అనిపించే 'హెడ్ బ్యాండ్ అప్ డూ' స్టైల్‌లో మెరిసిపోవడం ఖాయం.

# డిజైనర్ బ్లౌజ్ విత్ లెహంగా!

మాఘమాసం వేడుకల మాసం. అమ్మాయిల పార్టీవేర్ డ్రెస్ అంటే లెహంగా చోళీయే. ఎన్నో వెరైటీలలో కనువిందు చేసే బ్లౌజులు, లెహంగాలు చూడముచ్చటగొలుపుతుంటాయి. వీటి డిజైనింగ్ ప్యాటర్న్ తెలుసుకుంటే ఎవరికి వారు తయారుచేసుకోవడం సులువు.

**ఇంచులలో కొలతలు...**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛాతీకొలత | 32 | 34 | 36 | 38 | 40 | 42 |
| ఛాతీ చుట్టుకొలత | 33 | 35 | 36 | 38 | 40 | 42 |
| నడుము పొడవు | 15 | 15 | 16 | 16 | 17 | 17 |
| ఛాతీ కింది చుట్టుకొలత | 26 | 27 | 30 | 32 | 34 | 37 |
| భుజం | 11 | 12 | 12 | 13 | 13 | 14 |
| స్లీవ్ లెంగ్త్ | 3 | 3 | 3 | 3 | 3 | 3 |
| ఆర్మ్‌హోల్ చుట్టుకొలత | 14 | 15 | 15 | 16 | 17 | 17 |
| ఫ్రంట్ నెక్ | 6 | 6.5 | 7 | 7 | 7.5 | 7.5 |
| బ్యాక్ నెక్ | 8 | 8 | 8.5 | 8.5 | 9 | 9 |

రితికి, డిజైనర్



నిర్వహణ: ఎన్.ఆర్

కర్టెసీ: ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిజైన్ ఇన్నోవేషన్ (ఐడిఐ), హైదరాబాద్ www.idi.co.in

## ఫ్రంట్ బాడీ డ్రాఫ్టింగ్

- AB = వెయిస్ట్ లెంగ్త్ (భుజం నుంచి నడుము వరకు)
- AC = ఆర్మ్‌హోల్ రౌండ్/2
- AD = అపెక్స్ లెంగ్త్
- AA1 = భుజం /2
- CC1 = ఛాతీ పై కొలత/4
- DD1 = ఛాతీ చుట్టుకొలత /4
- BB1 = నడుము కొలత /4 + డార్ట్ వాల్యూమ్
- DD2 = BB2 = అపెక్స్ విడ్త్ /2
- A1 A2 = 1 ½ అంగుళాలు షోల్డర్ స్లోప్
- AA3 = నెక్ విడ్త్/2
- A3AX = ఫ్రంట్ నెక్ డెప్త్
- A3, A2 స్ట్రెయిట్ లైన్ షోల్డర్ స్లోప్
- A1 నుంచి కిందుగా స్ట్రెయిట్ లైన్ C2 వరకు మార్క్ చేయాలి.
- A2 & C2 సెంటర్ పాయింట్ A4
- A4 నుంచి అంగుళం లోపలికి A5 మార్క్ చేయాలి.
- ఆర్మ్‌హోల్ వంపుభాగం A2 A5 C1
- B2కి రెండువైపులా అర అంగుళం స్పేస్‌తో B3 & B4 మార్క్ చేయాలి. ఇది డార్ట్ వాల్యూమ్ అవుతుంది.
- ఆర్మ్‌హోల్ వంపు దగ్గరకు రావాలి. ఇక్కడ C1 లైన్‌కి పైన 2 అంగుళాల వద్ద C3 మార్క్ చేయాలి. ఇక్కడ నుంచి రెండు వైపుల పావు అంగుళం స్పేస్ ఇచ్చి C4, C5 మార్క్ చేయాలి.
- B3 నుంచి D2, C3 మళ్లీ B3 నుంచి D2 - C4, D2 నుంచి C5 ప్రిన్సెస్‌ప్యానెల్. B3 నుంచి D2 - C4, B4 నుంచి D2-C5 రెండు వైపులా వంపు భాగం అవుతుంది.




## స్లీవ్స్

- AB = స్లీవ్స్ లెంగ్త్
- AC = ఆర్మ్‌హోల్ రౌండ్/2
- CC1 = స్లీవ్ డెప్త్
- BB1 = స్లీవ్ రౌండ్/2
- A A1 = 1 అంగుళం A2 C1 స్ట్రెయిట్ లైన్ మధ్య పాయింట్ A2. A2కి రెండువైపులా అర అంగుళం స్పేస్‌తో A3 & A4 మార్క్ చేయాలి.
- మళ్లీ A A1 A3 C1 & A A1 A4 C1 ఆర్మ్‌హోల్ వంపు భాగం అవుతుంది.

నోట్: స్లీవ్స్ పొడవు ఎవరికి వారు నిర్ధారించుకోవచ్చు.




## లెహంగా డ్రాఫ్టింగ్

ప్యానెల్స్ సంఖ్య – 16

- AB = పొడవు (నడుము నుంచి ఫ్లోర్ లెవల్)
- AE = నడుము నుంచి హిప్ పొడవు
- AA1 = (నడుము చుట్టుకొలత / ప్యానెల్స్ సంఖ్య)/2
- EE1 = (హిప్ రౌండ్ / ప్యానెల్స్ సంఖ్య) /2
- BB1 = వాల్యూమ్ / ప్యానెల్స్ సంఖ్య)/2
- B1 B2 = 1/2 అంగుళాలు స్లోప్ పార్ట్

నోట్: లెహంగా వాల్యూమ్ 40 అంగుళాలు. 4 మీటర్లు = 40 అంగుళాలు 40X 4 = 160




## బ్యాక్ బాడీ డ్రాఫ్టింగ్

- AB = వెయిస్ట్ లెంగ్త్
- AC = ఆర్మ్ హోల్ రౌండ్/2
- AD = అపెక్స్ లెంగ్త్
- AA1 = భుజం /2
- EE1 = అప్పర్ బస్ట్ రౌండ్ / 4
- FF1 = బస్ట్ రౌండ్/ 4
- BB1 = వెయిస్ట్ రౌండ్/4 + డార్ట్ వాల్యూమ్
- AA3 = నెక్ విడ్త్/ 2
- AAX = నెక్ డెప్త్
- A3, A2 స్ట్రెయిట్ లైన్ షోల్డర్ స్లోప్
- A1 నుంచి కిందుగా E2 వరకు లైన్ గీయాలి.
- A2 & E2 మధ్య పాయింట్ A4 గా మార్క్ చేయాలి. A2 A4 E1 బ్యాక్ ఆర్మ్‌హోల్ వంపు.
- B2 రెండువైపులా అర అంగుళం మార్క్ చేయాలి. అవి B3, B4 డార్ట్ లైన్ అవుతుంది.
- F2 నుండి B3 B2 B4 డార్ట్ లైన్



● ఒక జ్ఞాపకం

# చదవేస్తే...

● వీఏకే రంగారావు

'మన సమాజంలో వెనుకబడినవారికి అందరితోబాటొక స్థానం కల్పిస్తే వారికి మంచి జరుగుతుందని పెద్దలు చెప్పడం విన్నాను. ఈనాడు వారికి పెద్ద చదువులు చదివే అవకాశాలున్నవి, దీని వలన మంచి ఉద్యోగాలు దొరుకుతున్నవి.

వారికి జరుగుతున్నది మంచేనా?' అన్నది నా మొదటి ప్రశ్న. ఇలా వారుద్ధరించబడితే, వారి వారి కులాలకున్న సహజ సంస్కృతి మిగిలి ఉంటుందా?' అన్నది రెండవది.

ఇక్కడ సంస్కృతి అంటే తీసుకోవలసినది విస్తృతార్థం. ఆట, పాట, భాష మాత్రమే కాదు వారి దుస్తులు, ఇల్లు, అందున్న వస్తువులు, తినేవి-తినకూడనివి, వండే తీరు,





శుభకార్యాలకూ, అశుభకార్యాలకూ (పుట్టినా, మెట్టినా, గిట్టినా) జరిపే తంతు, స్త్రీలూ, పురుషులూ చేయవలసిన పనులు, చేయకూడనివి, ఇంటా బయటా కార్యకలాపాలకు ఉపయోగించే పనిముట్లు - ఇవన్నీ సంస్కృతే. ఇదే ఎవరికైనా ప్రత్యేకమైన ఒక గుర్తింపునిస్తుంది.

నేను చెప్పబోయేది నా అనుభవం. పుస్తకాలలో చదివినది, ఆంత్రోపాలజిస్టులతో (నశాస్త్రజ్ఞులు) చర్చించినది కాదు.

నేను పుట్టింది (1939) మద్రాసులో అయినా 1960 వరకు నేను సంవత్సరంలో తొమ్మిది నెలలపాటు బొబ్బిలిలోనే (అప్పుడు విశాఖ, తరువాత శ్రీకాకుళం, ఇప్పుడు విజయనగరం జిల్లా) ఉండేవాడిని. మేముండే భవనం నా ముత్తాత బొబ్బిలిరాజా వీఎస్.రంగారావు కట్టించిన వేటవిడిది 'రాజమహల్'. ఊరికి కాస్త దూరంగా కట్టించడానికి కారణం పక్కనే ఉన్న చెలకల్లో, చిట్టడవుల్లో వేట సులభతరం అవుతుందని. ఆ కాలంలో వన్యప్రాణి రక్షణ చట్టం లేదు. అప్పట్లో అడవి పందులు, దుప్పులు, కొండ మేకలు, చిరుతలు, ఎలుగుబంట్లు, అరుదుగా పులులు ఆ చుట్టుపక్కల తిరిగేవి.

ముందుచూపుతో వేట సాయంగా కొన్ని కొండదొర కుటుంబాలను తెచ్చి-దగ్గరలో ఉన్న కురుపాంనుంచని వినికిడి-ఈ రాజమహల్ వెనుకనే మైలు దూరాన వారికొక నివాసం ఏర్పాటు చేశారు. ఆ గూడేనికి పెద్ద రామన్నదొర కాబట్టది రావందొర వలసగా స్థిరపడింది.

నా చిన్నతనంలో (1945-1952) నా నాన్న ఆర్‌జేకే రంగారావు (మొదట సంగం వలస ఆ తరువాత చిక్కవరం జమిందారు) వేటకు నన్ను తీసుకువెళ్లేవారు. ఈ వలస నుంచి గంగందొర, తమ్మందొర అన్న నడివయస్కులు వచ్చి జంతువుల అడుగులు, మలమూత్రాల జాడలు గమనించి ఏ జంతువెక్కడ ఎప్పుడు తిరుగుతున్నదో అక్కడికి తీసుకువెళ్లేవారు. మరికొందరు రాజమహల్‌లో కూలి పనిచేయడానికి వచ్చేవారు. అలా వారితో నా పరిచయం.

అప్పుడా గూడెంలో డెబ్బై మందికిలోపే పూరిగుడిసెల్లో ఉండేవారు. మగవారు పక్కనున్న అడవిలో కట్టెలు కొట్టి కావళ్లపైనా, స్త్రీలు చిన్నమోపులు తలపై మోస్తూ ఊళ్లో అమ్ముకొనేవారు. మగవారు కొందరు నిపుణులు తేనెపట్టులను కొట్టి తీసిన తేనె, మైనం, వర్షాకాలంలో ఆగాకరకాయలు, పుట్టగొడుగులు, కంజు, పూరీడు, నెమలిపిట్టలను అమ్మచూపేవారు. అవి గుడ్లు పొదిగి పిల్లలను సాకే నెలలో మాత్రం వాటిని పట్టేవారు కాదు. అడవిలో కాసిన మామిడి, రేగు, జీడి మామిడి, నేరేడు పళ్లను కూడా బజారుకు తీసుకువెళ్లేవారు. కొద్దిపాటి సేద్యం-కేవలం వర్షాధారంతోటే మెట్టభూముల్లో పండే పంటలు-చేసేవారు.

మాతో తెలుగు యాసతో మాట్లాడినా వారిలో వారు కొండదొర భాషే మాట్లాడుకునేవారు. మగవారి దుస్తులు మోకాళ్ల వరకు వేలాడే గోచీ పెట్టుకున్న చిన్న పంచెలు, భుజంపైన ఒక గుడ్డ. స్త్రీలు ఐదు గజాల మోటుగుడ్డ చీరలా కట్టుకునేవారు. అదీ మోకాళ్ల వరకే. రైక ఉండేది కాదు, వారి చుట్టూ ఒక వాసన ఉండేది. వారున్న గుడిసెలలోనే వండుకునే పొయ్యిల్లో వాడే కర్రల పొగ వాసన.

దాదాపు 1960 వరకు పెద్ద చదువులంటూ లేవు. నలుగురైదుగురు మాత్రం ఊళ్లో స్కూళ్లకు వెళ్లేవారు. ఆ తరువాత ప్రభుత్వమేర్పాటు చేసిన రెసిడెన్షియల్ బడుల్లో చదువులు. ఇప్పుడు డిగ్రీలు చదివినవారూ ఉన్నారు. వీళ్ల చుట్టుపక్కల ఊళ్లలో పనిచేస్తుంటే, ఆ మాత్రం చదువులేని వారు పక్కనే ఉన్న జూట్ మిల్స్‌లో చేస్తున్నారు.

నేడు వారి దుస్తులు అందరి లాగానే ప్యాంటు, టీ షర్టు పురుషులైతే; స్త్రీలైతే అద్దకాల

చీరలు, ఆధునికమైన కత్తిరింపులతో మేచింగ్ రవికెలు. వీరిని బొబ్బిలిలో చూస్తే కొండదొరల తాలూకని పోల్చుకోలేం.

వింతేమిటంటే వారి రూపురేఖలు మారిపోయి మనలాగే కనపడుతున్నారు. దీనికి కారణం? వేరే కులాలలో చేసుకున్న వారొక ఇరవై మంది ఉంటారు గత పదేళ్లలో. కాని దీనికి ముందే వారి రూపంలో మార్పు వచ్చింది.

ఎలా? నా ఊహ. చదువులు, దానితోపాటు నాజూకులు, సినిమాలు. ఇవి చూడడం వలన చెడిపోవడం కాదు గానీ 'అలా ఉంటే బావుంటుంది' అన్న భావన వారిలో కలిగింది. అలాంటి రూపురేఖలున్నవారినే–వారిలోనే–జీవిత భాగస్వాములుగా ఎంచుకోవడం జరిగింది.

అందరిలో కలిసిపోయేలా రూపం ఉన్నవారికి తక్కినవారి కన్నా మంచి ఉద్యోగాలు. చక్కని వారితో వివాహాలు. ఇలాటి వారికే బయటివారి నుంచి ప్రోత్సాహాలు.



ఒక లాడ్జి ఓనరు నాతో 20 ఏళ్ల క్రితం అన్నాడు కదా ''లోపల పనైతే రూపం ఎలా ఉన్నా పెట్టుకోవచ్చు, కానీ రిసెప్షన్‌లో, రూము బాయిస్‌లో కొండ దొరల్లా కనబడినవారిని పెట్టుకొనడం కష్టం. ఇబ్బంది నాకు కాదు, దిగే ప్యాసింజర్లకి''.

పదేళ్ల కిందట రాజమహల్ వెనుక రోజువారీ నడకకు వెళ్లినప్పుడొక అమ్మాయి కనిపించింది. సన్నం, నలుపే కానీ ధరించిన చీర, జాకెట్టు, కుచ్చిళ్ల అమర్చిన తీరు చూస్తే 'ఫ్యాషన్ పెరేడ్'కి వెళుతున్నట్లనిపించింది. అడిగితే 'మాది రావందొరవలసే' అంటే నిర్ఘాంతపోయాను. కుర్రకారు వేషాలూ అలాగే అప్–టు–డేట్‌గా ఉన్నాయి. జీన్సు, జాకెట్లు, చేతికలంకారాల్లా సరికొత్త సెల్సు.

ఈ తరం వారికి వారి భాష తెలియదు. చదువు సంధ్యలు లేనప్పుడు వారి పబ్బాలు, తినే అడవి దుంపలు, జంతువుల, పక్షుల మాంసం, తాగే జీలుగు కల్లు, మెట్టభూమిలో పండే తణధాన్యాలు, ఆకు కూరలు ఇప్పటి వారెరుగరు. వాళ్లిప్పుడు తినేది పాలిష్డ్ రైస్.

అప్పుడు వారి ఆట పాట అంత ప్రసిద్ధం కాకపోయినా అవి పురుషులకు, స్త్రీలకు వేర్వేరుగా ఉండేవి. పక్కనున్న పట్టణాల నుంచి గురువులను (వేరే కులం) తెప్పించుకుని పండరి భజన నేర్చి కన్నుల పండువగా ఇరవై ముప్ఫై మంది కలిసి చేసేవారు.

ఇప్పటివారికివేవీ తెలియవు. అడిగితే 'కూడూ గుడ్డా పెట్టని విద్యెందు'కంటారు.

నాకు తెలిసిన ఒక కుర్రవాడు మామిడి రాము వయస్సు 26. ఆరవ తరగతి వరకు చదివాడు. బొబ్బిలిలో ఎలక్ట్రీషియన్ పని నేర్చాడు. కొంతకాలం హైదరాబాద్‌లో మంచి ఉద్యోగమే (డ్రిల్లింగ్ ఇత్యాది)



చేశాడు. ఈ వ్యాసానికి కావలసిన విషయం అతని ద్వారానూ, అతని ముందు తరానికి చెందిన భారతి అనే ఆవిడ ద్వారాను సంపాదించాను. తప్పులు దొర్లితే అవి నావి. ఆ రాము నేటి కుర్రకారుకొక ప్రతీక.

ఆ కాలంలోనే బొబ్బిలిలో రెల్లివారు (షెడ్యూల్డు కాస్ట్; కొండదొరలు షెడ్యూల్డు ట్రైబ్) తోటల ఫలసాయం, ముఖ్యంగా మామిడి, జీడిమామిడి, జామ, సీతాఫలం, కమల, నారింజ, నిమ్మ, బత్తాయి పిందెకట్టక ముందే పువ్వును చూసి యింతకని కొనేవారు. పళ్లు పూర్తిగా దించి లారీలకెక్కించేవరకు ఉండి, పూర్తిగా డబ్బు చెల్లించి, తామే వేసుకుని ఉన్న పాకలను విప్పి తమతోపాటే తీసుకు వెళ్లేవారు.

1960 వరకు రెల్లివారు తమకే సొంతమైన జానపద నాట్యాలు చేసేవారు. ఒక మగాడు, ఆడవేషంలో మరొక మగాడితో యుగళం. ఆడది 'కీ మామా?' అంటే మగాడు 'కీ పోలీ'! అని నాట్యం పాటతో మొదలుపెట్టేవారు. ఇప్పటివారది చేయటం కాదు కదా, చూసి కూడా ఎరుగరు. వారి భాష పూర్తిగా మరచిపోయారు. ఆనాడు ఆ స్త్రీ పురుషుల కట్టు వేరు. ఈనాడందరితోపాటు అల తెర తెరల్లా.

1960కి కొంచెం ముందు మా మామిడికాపు కొన్న రెల్లి కుటుంబంలో పదేళ్ల పిల్లవాడు అతని చెల్లెలు ఈ నాట్యం చక్కగా చేసేవారు. నేను ప్రతి ఉదయం ఆ తోటలోనుంచి నడచి వెళుతున్నపుడు వాళ్లను పలకరించి కాసేపు ఆడమనేవాణ్ణి. వారిలో చాలామంది లాగానే వారిద్దరి రంగు ఎరుపుతో కూడిన తెలుపు, యూరోపియన్లలాగా. ఆ పిల్ల చురుగ్గా ఉండేది కానీ చనువుగా



మసిలేవాడు ఆ పిల్లవాడే. వయసు వస్తే భలే అందగాడయ్యే సూచనలుండేవి. ఆ తరువాత వారిని మళ్లీ చూడలేదు.

1985 ప్రాంతంలో నేను నాట్యసభలకు ఢిల్లీ వెళ్లాను. చివరి రాత్రి భోజనాలయ్యిన తరువాత నన్ను పిలిచినవారు రంగారావని సంబోధిస్తూ తెలుగులో వీడ్కోలు చెప్పారు. పది మైళ్ల దూరంలో ఉన్న గెస్ట్ హౌస్‌లో నన్ను జాగ్రత్తగా దించమని ఢిల్లీ హిందీలో ఆ ప్రయివేటు టాక్సీ డ్రైవర్‌కి అప్పజెప్పారు.

విడిది చేరి సంచులకెత్తిచ్చిన సంబరాలు నా గదిలో పెట్టడానికి వచ్చినపుడు బక్షీస్ ఇవ్వబోతుంటే వారించి ఆ డ్రైవర్ నన్నడిగాడు. ''మీరు రాజమహల్ ఆనందనాయనా?'' అని. (నన్నలాగ పిలిచేది రాజమహల్‌లో

నన్నెరిగినవారే). నా ముఖాన కొడవలి కోతకు నెత్తుటి చారలేదు. నా ఆశ్చర్యాన్ని చూసి చిరునవ్వుతో ''నేన్నాయనా, మీ తోట కొన్న రంగమ్మ కొడుకుని'' అని చెప్పితే గట్టిగా వాటేసుకున్నాను. తానే కాస్త యిబ్బంది పడ్డాడు. దూరంగా జరిగి జాగ్రత్తగా గమనించాను. ముఖంలో అందం కన్నా ఎక్కువ మొరటుతనం, ఒక విధమైన నైరాశ్యం కనిపించాయి. నా దిగ్భ్రమకంతులేదు. బొబ్బిలి రెల్లిపిల్లవాడెక్కడ, ఢిల్లీ ప్రయివేటు టాక్సీ డ్రైవరెక్కడ.

కూర్చోమంటే కూర్చోకుండా నిలబడే తన కథ కొంత చెప్పుకొచ్చాడు. ''స్కూలు ఫైనలు మంచి మార్కులతో పాసయ్యాను, మంచి ఉద్యోగమే వచ్చింది బొబ్బిలిలోనే. తోటివారు ప్రతిదాంట్లోనూ నన్ను ఎడంగా ఉంచేవారు. మంచి బట్టలేసుకుని శుభ్రంగా ఉన్నా అంటరానివాడిగా చూసేవారు. విసిగెత్తి హైదరాబాదు వెళ్లాను. అక్కడా అంతే. నా రంగు, మాట తీరు పట్టిచ్చేశాయి.

అక్కడొక పంజాబీ డ్రైవరు కలిసి తాగి తందనాలాడి నేస్తుడై ఢిల్లీకి రమ్మంటే వెళ్లాను. నాకతను తన డ్రైవరుద్యోగమిప్పించి (హైదరాబాద్‌లో లైసెన్స్ సంపాదించాను) తను అమృత్‌సర్ వెళ్లిపోయాడు.

నా యజమానురాలు ఒంటరి. ఏం పని చేసేదో తెలియదు. ఎందరో ఆమెను చూడడానికి వచ్చేవారు. అమె ఎక్కడెక్కడికో వెళ్లేది.

**నా ముఖాన కొడవలి కోతకు నెత్తుటి చారలేదు. నా ఆశ్చర్యాన్ని చూసి చిరునవ్వుతో "నేన్నాయనా, మీ తోట కొన్న రంగమ్మ కొడుకుని" అని చెప్పితే గట్టిగా వాటేసుకున్నాను. తానే కాస్త యిబ్బంది పడ్డాడు. దూరంగా జరిగి జాగ్రత్తగా గమనించాను. ముఖంలో అందం కన్నా ఎక్కువ మొరటుతనం, ఒక విధమైన నైరాశ్యం కనిపించాయి. నా దిగ్భ్రమకంతులేదు. బొబ్బిలి రెల్లిపిల్లవాడెక్కడ, ఢిల్లీ ప్రయివేటు టాక్సీ డ్రైవరెక్కడ.**

నాకప్పటికి ఆ భాష రాదు కనుక ఏమీ తెలిసేది కాదు. మొదట్లో నేనుండడం కారుషెడ్డులో. నా శుచి, శుభ్రతను గమనించి నన్ను గెస్ట్ రూములోకి మార్చింది. జీతమెక్కువ కాకపోయినా ఆమె యింటిలోనే ఉండడం, ఆమె తిన్నదే తినడం. ఆమె కోసం చెప్పినవి, చెప్పనవి, చెప్పకూడనివి అన్నీ పనులు చేసిపెట్టాను. ఆమె ఎక్కడికో వెళ్లిపోతూ తన అంబాసిడర్ కారు నా పేరిట ట్రాన్స్‌ఫర్ చేసింది. అప్పటి నుంచీ నాకిదే పని.

ఒంటరిగా ఉంటున్నాను. ఏది కావలసినా పదడుగులు వేస్తే దొరుకుతుంది. పెళ్లి అవసరమనిపించడం లేదు. బొబ్బిలి రెల్లి పిల్లనిక్కడకు తీసుకువచ్చి దానిక్కాపలా కాయలేను. నేను నాలుగైదు రోజులు ట్రిప్పుకెళితే దాన్ని చూసుకునేది ఎవరు! చిన్నప్పుడు చేసే డాన్సులా? ఆ మాట చెబితేనే నాకు కంపరం. ఆ డాన్సుల వలనే నా చెల్లి బొంబాయి బారులో ఉద్యోగం పాలపడింది. అమ్మా, నాన్న ఉన్నంతకాలం మేమిద్దరం డబ్బు పంపేవాళ్లం. ఇప్పుడా పిల్లెక్కడుందో తెలియదు'' అని నా ఒళ్లో తలపెట్టుకుని చిన్నపిల్లాడిలా ఏడ్చాడు. ఏమని ఓదార్చను!

''చిన్నప్పుడు మీరు ప్రతిరోజూ నాకొక తాండ్రముక్క యిచ్చేవారు. అది నేను, నా చెల్లెలు తినేవాళ్లం. చిన్నప్పుడు మీరు నన్నెలా చూసుకున్నారో గుర్తుంది''.

''నీకు చదువుంది, ఇక్కడి భాష వచ్చింది, దేహదారుఢ్యం ఉంది, జీవనోపాధికి కారుంది. నీకేమి తక్కువ?'' అంటే ''ఎంత సంపాదన ఉన్నా బొబ్బిలిలో రథసప్తమి పండుగలో, విజయనగరం పైడితల్లి జాతరలో తోటి కుర్రాళ్లతో కలిసి డాన్సాడడం, మీరిచ్చిన తాండ్ర యివన్నీ!'' అంటూ చెమర్చిన కళ్లతో ఒక్క చూపు చూసి వెళ్లిపోయాడు.

ఐదేళ్ల తరువాత తాండ్రతో ఢిల్లీకి వెళ్లి తనిచ్చిన పక్క దుకాణానికి టెలిఫోన్ చేశాను. మోగలేదు. తీసుకువెళ్లిన తాండ్ర అలాగే మిగిలిపోయింది.

వ్యాసకర్త ఫోన్ నెం.: 94447 34024

• విడ్డూరం

## కమ్మని చికెన్ క్యాండిల్!



ఫ్రైడ్ చికెన్ వాసన అంటే ఇష్టపడేవాళ్లకు ఇది నిజంగా శుభవార్తే. ఇక ముందు 'ఫ్రైడ్ చికెన్' చేస్తున్నప్పుడు మాత్రమే... ఆ వాసనను ఆస్వాదించనక్కర్లేదు.

క్యాండిల్ వెలిగిస్తే చాలు...

కమ్మని చికెన్ వాసన వస్తుంది.

ఫాస్ట్‌ఫుడ్ రెస్టారెంట్ కంపెని కె.ఎఫ్.సీ, ఫ్రైడ్ చికెన్ వాసన వచ్చే సరికొత్త క్యాండిల్‌ను విడుదల చేసింది. దీని మీద భిన్నాభిప్రాయాలతో పాటు 'హాస్యం' కూడా వినిపిస్తుంది.

**ఉదా:** 'ఆకలేస్తుందా? కెఎఫ్‌సీ క్యాండిల్ వెలిగించండి చాలు'

'కర్రీ నచ్చలేదని కలత చెందవద్దు... కె.ఎఫ్.సీ క్యాండిల్ వెలిగించడమే ముద్దు'

## కూతురు కావలెను!

దక్షిణ చైనాకు చెందిన లీ యాలింగ్‌కు అరవై మూడు సంవత్సరాలు. సరదాగా యాత్ర చేయాలని బుద్ధి పుట్టింది. కానీ తానేమో ఒంటరి. అలా అని ఆమెకు ఎవరూ లేరని కాదు. కూతుళ్లు ఉన్నారు. కాని వేరే దేశాల్లో ఉన్నారు. దీంతో ప్రయాణంలో ఎవరినైనా



తోడుగా తెచ్చుకోవడం కోసం... 'యాత్ర చేయాలనుకుంటున్నాను. నాకో కూతురు కావలెను' అంటూ సోషల్ మీడియాలో ప్రకటన ఇచ్చింది. కూతురుగా వచ్చే అమ్మాయి రవాణాఖర్చులన్నీ భరించడంతో పాటు అద్దె కూతురుకు ఐఫోన్ కూడా కొనిస్తానని గట్టిగా చెబుతోంది!

## కాళ్లతో కరెంట్ పుట్టించారు!

'ఆయన నరాల్లో కరెంట్ ఉంది' అంటుంటారు కవితాత్మకంగా.

అదేమిటోగానీ దుబాయ్‌లోని బుజ్‌పార్క్ డౌన్‌టౌన్‌లో మూడువందల మంది... గంట వ్యవధిలో స్టేషనరీ బైస్కిల్ పెడల్ తొక్కడం ద్వారా 8,999 వాట్స్ విద్యుత్‌ను సృష్టించి సరికొత్త రికార్డ్ సృష్టించారు.

బ్రిటన్‌లోని స్టాక్‌పార్క్‌లో, స్టాటిక్ బైస్కిల్స్ పెడలింగ్ ద్వారా గంట వ్యవధిలో 8,370 వాట్స్ సృష్టించడం ద్వారా ఏర్పడిన రికార్డ్‌ను తాజా రికార్డు బ్రేక్ చేసింది.



● సందేహం

# సైడ్ ఎఫెక్ట్స్ ఉంటాయా?




డా॥ వేనాటి శోభ
లీలా హాస్పిటల్
మోతీనగర్,
హైదరాబాద్


**● ప్రస్తుతం నేను ప్రెగ్నెంట్‌ని. గతంలో ఒకసారి 'ముత్యాల గర్భం' అనే దాని గురించి విని ఉన్నాను. అయితే వివరాలేవీ సరిగా గుర్తులేవు. ఇంతకీ 'ముత్యాల గర్భం' అంటే ఏమిటి? ఎందుకు వస్తుంది? నాలాంటి వాళ్లు ఏమైనా జాగ్రత్తలు తీసుకోవాలా?**

**- రమ్య, కరీంనగర్**

గర్భం దాల్చినప్పుడు గర్భాశయంలో పిండంతో పాటు దానికి తల్లి నుంచి రక్తం సరఫరా అందించేందుకు మాయ ఏర్పడుతుంది. కొందరిలో సరిగా తెలియని అనేక రకాల కారణాల వల్ల పిండం పెరగకుండా, మాయ మాత్రమే గర్భాశయంలో ముత్యాల్లాంటి నీటి బుగ్గలుగా మారి, అది పెరిగిపోతూ ఉంటుంది. దీనినే ముత్యాల గర్భం అంటారు. పిండం నిర్మాణంలో లోపం, ఒక అండంలోకి రెండు శుక్రకణాలు వెళ్లి ఫలదీకరణ చెందినప్పుడు, నిర్వీర్యమైన అండంలోకి ఒక శుక్రకణం వెళ్లి, ఫలదీకరణ చెంది, అది విభజన జరిగినప్పుడు హార్మోన్ల అసమతుల్యత, వ్యాధి నిరోధక వ్యవస్థలో మార్పులు, విటమిన్ ఎ లోపం వంటి ఎన్నో కారణాల వల్ల ముత్యాల గర్భం ఏర్పడుతుంది. నెలలు పెరిగే కొద్దీ ముత్యాల నీటి బుగ్గలు రెట్టింపు అవుతూ, గర్భాశయం పెద్దగా పెరుగుతూ ఉండి, మధ్యమధ్యలో నీరు, రక్తం కలిసి కొద్దికొద్దిగా బ్లీడింగ్, కడుపులో నొప్పి వంటి లక్షణాలు కనిపించవచ్చు. లేకపోతే అది గర్భాశయంలోని అన్ని పొరలలోకి పాకి, లోపలే బ్లీడింగ్ ఎక్కువగా అయ్యి, మనిషి పాలిపోయినట్లుండి, బాగా ఆయాసపడిపోతూ, షాక్‌లోకి వెళ్లిపోవచ్చు. కొందరిలో ఉన్నట్లుండి రక్తస్రావం అధికంగా అయ్యి, ప్రాణాపాయ స్థితిలోకి వెళ్లవచ్చు. దీనికి చికిత్స... ముత్యాల గర్భాన్ని డి మరియు సి లేదా సక్షన్ ఎవాక్యుయేషన్ ద్వారా తీసివేయడం. ముత్యాల గర్భం రాకుండా జాగ్రత్తలు తీసుకోవడానికి మన చేతిలో ఏమీ లేదు. కాకపోతే రెండు, మూడు నెలలలో స్కానింగ్ చేయించుకోవడం వల్ల ముందుగానే ఈ సమస్యను గుర్తించి కాంప్లికేషన్స్‌లోకి వెళ్లకముందే దానిని తొలగించవచ్చు.

**● మా బంధువుల్లో ఒకరికి చాలాకాలం నుంచి పిల్లలు లేరు. 'డి అండ్ సీ ఆపరేషన్' ద్వారా మహిళలకు పిల్లలు కలిగేలా చేస్తారని చదివాను. 'డి అండ్ సీ ఆపరేషన్' అంటే ఏమిటి? ఈ ఆపరేషన్ వల్ల సైడ్ ఎఫెక్ట్స్ ఏమైనా ఉంటాయా? 'కొందరు మాత్రమే ఈ ఆపరేషన్‌కు అర్హులు' (శారీరక పరిస్థితులను బట్టి)లాంటివి ఏమైనా ఉన్నాయా? తెలియజేయగలరు?**

**- డి.జానకి, విజయనగరం**

డి అండ్ సీ ఆపరేషన్ అంటే డైలటేషన్ అండ్ క్యూరెటాజ్. గర్భసంచి ద్వారమైన సర్విక్స్‌ను డైలేట్ చేసి అంటే కొద్దిగా తెరవడానికి వెడల్పు చేసి గర్భాశయంలోని పొరను క్యూరెట్ అనే పరికరం ద్వారా శుభ్రం చేయడం (గీకటం). కేవలం డి అండ్ సీ చెయ్యడం వల్లనే గర్భం దాల్చరు. అండం విడుదల అవ్వడం, సరిగా ఉండి, ట్యూబ్స్ తెరుచుకుని ఉండి, మగవారిలో వీర్య కణాలు సరిగా ఉన్నా, మిగతా హార్మోన్లలో అసమతుల్యత వంటి ఇతర సమస్యలు ఏమీ లేకుండా ఉండి, గర్భాశయ ద్వారం చాలా సన్నగా ఉన్నప్పుడు డి అండ్ సీ ద్వారా, ఆ ద్వారాన్ని వెడల్పు చెయ్యడం వల్ల వీర్య కణాలు తేలికగా గర్భాశయంలోకి ప్రవేశించడం ద్వారా గర్భం వచ్చే అవకాశాలు పెరుగుతాయి. అంతే కాని, డి అండ్ సీ ద్వారా గర్భం కచ్చితంగా వస్తుందని చెప్పలేం. అలాగే గర్భాశయంలోని పొరను శుభ్రం చేయటం, అలానే దానిని గీకటం వల్ల కొందరిలో మళ్లీ పొర ఆరోగ్యంగా ఏర్పడి పిండం గర్భాశయంలో (అతుక్కోవడానికి) నిలబడడానికి (ఇంప్లాన్‌టేషన్) దోహద పడుతుంది. ఆధునిక చికిత్స లేని పాతకాలంలో పిల్లలు కలగనివారికి దాదాపుగా అందరికి డి అండ్ సీ చేసేవాళ్లు. దాంతో మిగతా ఇబ్బందులు లేనప్పుడు, చాలామందికి గర్భం రావడం జరిగేది. దీనినే వాడుక భాషలో కడుపు కడగటం, గర్భ సంచిని కడగటం అంటారు.




ఇంటికి - ఒంటికి
31వ పేజీలో


ఈ ఆపరేషన్ ఎవరైనా చేయించుకోవచ్చు. నొప్పి తెలియకుండా మత్తు ఇచ్చి, యోని భాగంలో నుంచి డి అండ్ సీ చేస్తారు. శుభ్రత పాటించని హాస్పిటల్స్‌లో చెయ్యించుకుంటే ఇన్‌ఫెక్షన్‌లు వచ్చే అవకాశాలు ఉంటాయి. అంతకంటే వేరే సైడ్ ఎఫెక్ట్స్ ఏమీ ఉండవు. గర్భాశయంలో శుభ్రం చేసిన పొరను బయాప్సీకి పంపిస్తే, దానిలో ఏవైనా సమస్యలు ఉంటే తెలుస్తాయి.

**● నాకు కొత్తగా పెళ్లయింది. అయితే నా భర్త నాకు దూరంగా ఉంటున్నారు. 'ఆమె దగ్గర విపరీతమైన దుర్వాసన వస్తుంది' అని నా గురించి ఎవరితోనో చెప్పారట. నిజానికి శుభ్రత విషయంలో నేను చాలా స్ట్రిక్ట్‌గా ఉంటాను. 'అతి శుభ్రత పాటిస్తావు' అని కూడా వెక్కిరించేవాళ్లు. అలాంటి నా దగ్గర దుర్వాసన రావడం ఏమిటో అర్థం కావడం లేదు. దీనికి సంబంధించి ఏదైనా చెబుతారని ఆశిస్తున్నాను.**

**- డి.కె, నిర్మల్**

మీ వారి దృష్టిలో దుర్వాసన అంటే ఎక్కడి నుంచి వస్తుందని ఆలోచిస్తున్నారో. కొంతమందిలో నోటి నుంచి కూడా దుర్వాసన రావచ్చు. కొందరిలో యోనిలో ఇన్‌ఫెక్షన్స్ వల్ల దుర్వాసన రావచ్చు. కొంతమంది మగవారు మనసులో ఏదో పెట్టుకుని, కారణం ఏదో ఒకటి చెబుతుంటారు. నిజంగా ఆయనకి ఏదైనా నీవల్ల ఇబ్బంది అనిపిస్తే అది నీతో మాట్లాడి, సమస్యకు మార్గం ఏమిటో, డాక్టర్‌కు చూపించటమో ఏదో చెయ్యాలి కాని, బయటవాళ్లకి నీమీద చెప్పటం వల్ల ఉపయోగం ఏమీ ఉండదు కదా! ఒకసారి నువ్వే ఆయనతో నీ వల్ల ఆయనకు ఏమి ఇబ్బందిగా ఉందో మాట్లాడి, సమస్యను నువ్వే పరిష్కరించుకోవాలి. నిజంగా ఏదైనా ఇబ్బంది ఉంటే డాక్టర్‌కి చూపించి చికిత్స తీసుకోవచ్చు. లేకపోతే ఈ దూరం పెరిగిపోయి, మనస్పర్థలు వచ్చే అవకాశాలు ఉంటాయి.

• సీరియల్ - ఒకటవ అధ్యాయం

# 1

శ్రావణమాసం.

కృష్ణదేవిపేట గ్రామ చావడిలో మృదంగ నాదం వినిపిస్తోంది. ఆ వెంటనే తాళానికి అనుగుణంగా భద్రాచల రామదాసు కీర్తన ఒకటి అందుకున్నారు బాలలు-అవాళ్టికి పురాణ ప్రవచనం ముగిసిందన్నట్టుగా.

ఆరోజు జూలై 24, 1917. సోమవారం. ఊళ్లో వారపు సంత కూడా ఆరోజే. అందుకే ముందే ముగించారు.

వ్యాసపీఠం మీద ఉన్న భాస్కర రామాయణాన్ని మూసి, భక్తిగా నమస్కరించారు గ్రామపెద్ద చిటికెల భాస్కరనాయుడు. భాస్కరుడుగారు అంటారంతా, క్లుప్తంగా. పండుగలూ, పర్వదినాలలోనే కాదు, ఇలా శ్రావణం వచ్చినా, కార్తీకం వచ్చినా ఉదయం వేళ పురాణం చెప్పేది ఆయనే. ఎరుపు రంగు పంచె ధరించి, తెల్లని అంగీ వేసుకుంటారాయన. నిండా ఓం అని దేవనాగరి లిపిలో ముద్రించిన శాలువా నిండుగా కప్పుకుంటారు. నుదుట తిరునామం.

గ్రామ మునసబు లగుడు సత్యనారాయణ, అమాయకంగా మాట్లాడే పెద్దాయన చింతల నారాయణమూర్తి, చింతల అచ్యుయ్యనాయుడు, నాగులాపురం వాస్తవ్యుడు మర్రి సన్యాసిదొర, పక్కనే కొంగసింగి గ్రామస్థులు కొందరు విధిగా హాజరవుతూ ఉంటారు.

తామరపల్లి ఆదినారాయణ లయబద్ధంగా మృదంగం వాయిస్తూ ఉంటే, శ్రుతిశుభగంగా పాడుతున్నారు బాలలంతా. కళ్లు మూసుకుని తొడ మీద సుతారంగా చేత్తో తాళం వేస్తూ మృదంగ వాదనం వింటున్నారు భాస్కరుడు. వారి ఇంట్లోనే ఉంటూ, ఎక్కడెక్కడికో వెళ్లి మృదంగం నేర్చుకుని పన్నెండేళ్ల ప్రాయంలోనే చక్కటి ప్రావీణ్యం సంపాదించాడు ఆదినారాయణ.

నేలకి రెండడుగులు ఎత్తులో పాతిక బారలు పొడవు, ఓ పది బారలు వెడల్పు ఉండే అరుగు; దాని మీద ఆరు బలమైన టేకు గుంజలతో వేసిన బంగాళా పెంకు కప్పు. అంతే. అక్కడికి దాదాపు యాభయ్ అడుగుల దూరంలోనే ఉన్నా, తన విశాలమైన శాఖలతో చావడికి గొడుగు పడుతోంది- ఆ పురాతన మర్రిచెట్టు.

కీర్తన పూర్తికావస్తుండగా కళ్లు తెరిచి చిరునవ్వు నవ్వారు భాస్కరుడు- భేష్ అన్నట్టు. పొంగిపోయాడు ఆదినారాయణ.

పురాణ కాలక్షేపానికి స్వస్తి పలికిన తరువాత, చావడికి కొద్ది గజాల దూరంలోనే ఉన్న రామమందిరం వైపు చూసి, భక్తిగా చేతులు జోడించబోయారాయన అలవాటుగా.

ఎవరో మరి! చేతులు జోడించి నిలబడి ఉన్నాడు ఆ మందిరం ఎదుటే.

రెండు లిప్తల తరువాత ఇటు తిరిగాడా ఆగంతకుడు.

నిస్సందేహంగా ఊరికి కొత్త. సంత కోసం వచ్చినవాడా? అలా లేదు మరి!

తెల్లటి వస్త్రం అడ్డకట్టు కట్టుకున్నాడు. భుజాల నిండుగా మరో తెల్లటి వస్త్రం. ఇటే తిరిగి ఊరికి ఉత్తర దిశగా నడుస్తున్నాడు. చావడికి దగ్గరగా వచ్చే కొద్దీ నల్లటి గెడ్డం, మీసాలు, దీర్ఘకేశాలు ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి, ఆ ఎండలో. తెల్లని ఛాయ. ముఖం, ముంజేతులు పచ్చగా మెరుస్తున్నాయి. కుడిచేతిలో పసుపు రంగు గుడ్డ సంచి. లోపల ఏవో బరువుగా- బహుశా పుస్తకాలు. చావడి దగ్గరి సందడిని పట్టించుకోకుండానే ముందుకు సాగిపోయాడతడు. కాళ్లకి చెప్పులు లేకపోయినా ఆ నడకలో ఎంతో వేగం.

అదే వీధిలో ఉన్న బందెల దొడ్డి కూడా దాటేశాడు, చూస్తూ ఉండగానే. అటు సాగుతున్నాడంటే ఈ ప్రాంతం వాడు కాదన్నమాటే. ముందుకెళితే చిట్టడవే!

''నాన్నా! హారతి!'' అప్పుడే కూతురు సత్యనారాయణమ్మ - తొమ్మిదేళ్ల పిల్ల- కర్పూరం వెలుగుతున్న పళ్లెం ముఖానికి దగ్గరగా పెట్టి పిలిచింది,

యాంత్రికంగా కళ్లకద్దుకుని చావడిలోపల పరికించి చూశారాయన. చిత్రం, పినతండ్రి కొడుకు నారాయణమూర్తి కూడా ఆ ఆగంతకుడు వెళుతున్న వైపే కళ్లప్పగించాడు.

ఎవరో తట్టిలేపినట్టు కంగారుగా అన్నారు భాస్కరుడు, ''మన మతి మండినట్టే ఉంది. నారాయణమూర్తీ! ఇంకా చూస్తావేరా? ఆ స్వాములోరెవరో ఈ ఎండన బడిపోతన్నారు. పిల్చుకురా! ..ఇంటికి తీసుకెళ్లు...!''

''ఆ... ఆ.. సరే...''అంటూ చిన్న తొట్రుపాటుతో లేచి పెద్ద పెద్ద అంగలతో వెనకే వెళ్లాడు.

ఆగంతకుడు ఇంకా దూరం వెళ్లిపోయాడు.

''స్వామీ! అయ్యా స్వామీ! మిమ్మల్నే.. స్వాములోరు! '' కొంచెం గట్టిగా అరిచాడు నారాయణమూర్తి.

ఆ పిలుపుతో ఆ ఆగంతకుడు ఆగాడు. నమస్కారం పెట్టి ఏదో చెప్పాడు నారాయణమూర్తి. ఒక లిప్తపాటు ఆలోచించి వెనుదిరిగాడు ఆగంతకుడు.

అప్పుడు ఊపిరి పీల్చుకున్నారు భాస్కరుడు. ఊరికి సాధుసంతులు ఎవరొచ్చినా భాస్కరుడి గారింట భిక్ష, లేదా ఆతిథ్యమో స్వీకరించవలసిందే. ఆయన తల్లి సోమమ్మకి ఈ విషయంలో మరీ పట్టింపు.

ఐదారుగురు పెద్దలు

పురాణ కాలక్షేపానికి స్వస్తి పలికిన తరువాత, చావడికి కొద్ది గజాల దూరంలోనే ఉన్న రామమందిరం వైపు చూసి, భక్తిగా చేతులు జోడించబోయారాయన అలవాటుగా.
ఎవరో మరి! చేతులు జోడించి నిలబడి ఉన్నాడు ఆ మందిరం ఎదుటే.
రెండు లిప్తల తరువాత ఇటు తిరిగాడా ఆగంతకుడు.
నిస్సందేహంగా ఊరికి కొత్త. సంత కోసం వచ్చినవాడా? అలా లేదు మరి!
తెల్లటి వస్త్రం అడ్డకట్టు కట్టుకున్నాడు. భుజాల నిండుగా మరో తెల్లటి వస్త్రం. ఇటే తిరిగి ఊరికి ఉత్తర దిశగా నడుస్తున్నాడు. చావడికి దగ్గరగా వచ్చే కొద్దీ నల్లటి గెడ్డం, మీసాలు, దీర్ఘకేశాలు ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి, ఆ ఎండలో. తెల్లని ఛాయ. ముఖం, ముంజేతులు పచ్చగా మెరుస్తున్నాయి.

ఇంకా కూర్చునే ఉన్నారు. మిగిలిన ఈతాకు చాపలని చుట్టడం మొదలుపెట్టాడు నూకాలు. పూర్తి పేరు గంజేటి నూకాలమ్మ. అంతా నూకాలు అనే పిలుస్తారు. భాస్కరుడుగారి ఇంటి చాకలి. పొట్టిగా, లావుగా ఉంటాడు. సగం నెరిసిన దీర్ఘకేశాలను వెనక ముడేసుకుంటాడు. ప్రశాంతమైన ముఖం. ఏ ఆధ్యాత్మిక కార్యక్రమాన్ని వదిలిపెట్టడు. గొప్ప రామభక్తుడు. నుదుట సదా తిరునామం కనిపిస్తూనే ఉంటుంది. ఎప్పుడూ వెండి తీగ మొలకల్లాంటి గెడ్డం, మీసాలతోనే కనిపిస్తూ ఉంటాడు. దూరం దూరంగా ఉండే పలు వరుసతో అతడు మాట్లాడుతూ ఉంటే ప్రత్యేకంగా ఉంటుంది. కానీ అతడు మాట్లాడేది తక్కువ.

''నూకాలూ! ఇంటికెళ్లి అమ్మకి చెప్పరా! నూతి దగ్గర నీళ్లు తోడి పెట్టు. కొంచెం సేపు ఆంధ్రపత్రిక చదువుకుని నేనొస్తాను.'' అని పురమాయించారు.

ఊరి పెద్దలంతా కలిసి చందా వేసుకుని ఆంధ్రపత్రిక ఒక ప్రతిని పోస్టులో తెప్పించుకుంటున్నారు. పురాణ కాలక్షేపం ముగిసినా ఆ పెద్దలు అక్కడ కూర్చుని ఉండడం సామూహిక పత్రికా పఠనం కోసమే. మద్రాసు నుంచి రావాలి. ఈ మూలకి రావడానికి రెండు రోజులూ, మూడేసి రోజులూ పడుతూ ఉంటుంది. ఒక్కొక్కసారి వారం కూడా.

•••



● డా. గోపరాజు నారాయణరావు

''భోజనం చెయ్యనన్నారు... ఈ పలహారమైనా తీసుకోండి బాబయ్యా!'' గొంతు నిండా ఆప్యాయతతో అంది సోమమ్మ.

అప్పుడే ధ్యానం ముగించుకున్న ఆ అపరిచితుడు తనకు చూపించిన వీధిగదిలోకి వచ్చి గోడవారగా పరిచిన ఈతాకు చాప మీద కూర్చుని కిటికీలో నుంచి చూస్తున్నాడు–ఎండని. అప్పుడే వినిపించిందా పిలుపు, చల్లగా. ఆ ధ్యానం, ఆ దీక్ష చూసి సోమమ్మ గారు ఎంతో ముచ్చటపడిపోయారు.

నీళ్ల ఉపరితలం మీద పడిన వెన్నెలలా మెరుస్తున్న వెండిపళ్లెం పట్టుకుని గుమ్మంలో నిలబడి ఉంది సత్యనారాయణమ్మ. ఇంట్లో అంతా 'కన్నతల్లి' అని పిలుచుకుంటారు, ముద్దుగా. ఆ పళ్లెంలో ఉడకబెట్టి, తొక్క తీసిన చిలగడ దుంపలు నిండుగా, వాటి పక్కనే చిన్న గాజు గిన్నెలో పంచదార. తళతళ మెరిసిపోయేటట్టు తోమిన రెండు ఇత్తడి గ్లాసులను వేరొక పళ్లెంలో పెట్టుకుని సోమమ్మ మనవరాలి వెనుకే నిలబడి ఉంది.

ఒక గ్లాసులో మంచినీళ్లు, ఇంకో గ్లాసులో వేడి వేడి ఆవుపాలు. ముక్కుకు అడ్డబాసతో, చేతికి బంగారు మురుగులతో, కాళ్లకి వెండికడియాలతో ఉత్తరాంధ్ర పడికట్టులో ఉన్నారు అరవైఅయిదేళ్ల సోమమ్మగారు.

గుండ్రని ముఖం కన్నతల్లిది. భాస్కరుడిగారి మొదటి సంతానం. దమయంతి పచ్చ రంగు పట్టుబట్టలతో ముచ్చటగా, ముద్దుగా ఉంది. ఎడమ చేయి వేళ్ల కణుపుల దగ్గర కల్యాణబొట్టును పచ్చబొట్టుగా పొడిపించారు. కొంచెం పొట్టి కావడం వల్ల తొమ్మిదేళ్ల పిల్లలా కనిపించదు.

చిరునవ్వుతో వినయంగా చిలగడ దుంపల పళ్లెం అందుకున్నాడతడు.

కాంతిమంతమైన లేత ముఖం. రెండు కనుబొమలు దట్టంగా ఉండి, భృకుటి దగ్గర లీలగా కలుస్తున్నట్టు ఉన్నాయి. అక్కడ మొదలైన ఎఱ్రని నిలువు



## మన్యవీరుడు అల్లూరి గాథ

బొట్టు–జట్టును తాకుతోంది. మెడలో యజ్ఞోపవీతం. తెల్లని ఛాతీ మీద బఠాణీ గింజలంత రుద్రాక్షలతో మాల.

'ఇరవయ్యేళ్లేనా ఉంటాయా?!' మనసులోనే ప్రశ్నించుకుంది సోమమ్మ.

సోమమ్మగారు ఏవేవో అడుగుతూనే ఉన్నారు. ఆయన ముక్తసరిగా సమాధానాలిస్తూ, తినడం పూర్తి చేసి అందులోనే చేతులు కడుక్కున్నాడు.

తలొంచుకుని పాలు తాగుతుంటే వినిపించింది గొంతు,''చిటికెల భాస్కరనాయుడు అంటారు నన్ను!'' రెండు చేతులూ జోడించి సవినయంగా చెప్పాడు. పత్రికా పఠనం మధ్యలోనే వచ్చేశారు.

ఆగంతకుడు కూడా లేచి నిలబడి నమస్కరించాడు చిరునవ్వుతో. కానీ తానెవరో చెప్పలేదు. గృహస్థుకు మర్యాద కాదు కాబట్టి, భాస్కరుడు అడగలేదు.

''అబ్బాయీ! వారు భోజనం చేయరట!'' అన్నది సోమమ్మ.

''సోమవారమని కాబోలునమ్మా!'' అన్నాడు భాస్కరుడు.

''పక్వాహారం తీసుకోకూడదన్నది నా నియమం, అంతేనమ్మా!'' అన్నాడు అపరిచితుడు.

''పోనీ, బ్రాహ్మల ఇంటిలో వంట చేయించమంటారా?'' ఏదో తప్పిదం జరిగినంతగా, వెంటనే సరిదిద్దుకోవాలన్నట్టు అడిగారు భాస్కరుడు.

''వారు వండినా, మీరే వండినా నేను వండిన ఆహారం తినను! పాలూ పళ్లే నా భోజనం. ఇది కొన్నేళ్లుగా నేను పాటిస్తున్న నియమం అన్నయ్యగారు!'' అన్నాడు ఆగంతకుడు.

''కొంచెం సేపు విశ్రమించండి బాబయ్యా! ఎక్కడ నుంచి వస్తున్నారో ఏమో!'' అంది సోమమ్మ, ఆ పళ్లేలూ, గ్లాసులూ తీస్తూ.

●●●

ఎప్పుడు నెమ్మదించాడో ఏమో, చాప మీద రెడ్డిగం వేసుకు కూర్చుని ఏదో ఉద్గ్రంథం చదువుకుంటున్నాడు ఆ అపరిచితుడు.

మజ్జిగ గ్లాసుతో సోమమ్మ, ఆ వెనుకే భాస్కరుడు వచ్చారు.

తదేక దీక్షతో చదువుకుంటున్నాడతడు. ఆ పుస్తకం 'వేదాంత పంచదశి'.

''బాబూ, కొంచెం మజ్జిగ పుచ్చుకోండి!'' అంది సోమమ్మ, గ్లాసు కింద పెడుతూ.

తలూపాడతడు, పుస్తకం నుంచి దృష్టి మరల్చకుండానే.

ఇంక పలకరించే సాహసం ఇద్దరూ చేయలేదు. ఒక్క నిమిషం మాత్రం నిలబడి, ఆ పుస్తకం ఏదో గమనించి వెనుదిరిగాడు భాస్కరుడు.

దీపాలు పెట్టేవేళ అవుతుండగా లేచి నూతి దగ్గర స్నానం చేసి మళ్లీ ధ్యానంలో కూర్చున్నాడతడు.

నాలుగు రోజులు అలాగే గడిచిపోయాయి. ఐదో రోజునే జరిగిందా సంఘటన.

●●●

ఎర్రటి వెలుతురుని తెల్లగా మార్చుకుంటున్నాడు సూర్యభగవానుడు. తాండవ మాత్రం ఎర్రరంగు కొత్త నీటితో పారుతోంది–నిండుగా, నిశ్శబ్దంగా. అంతా కలిపి ఇరవై బారల వెడల్పు. పండుగలూ పబ్బాలలో ఊరంతా అక్కడికే వచ్చి పవిత్ర స్నానాలు చేస్తారు. గుహలా ఉంటుందక్కడ. అదే గుమ్మి. ఆ ప్రదేశంలోనే సాలగ్రామాలను పోలిన పెద్ద పెద్ద రాళ్లు. ఆ వేకువ వెలుగులో చూస్తుంటే నీళ్లలో బుద్ధిగా పడుకున్న గున్న ఏనుగులను మరిపిస్తున్నాయి. గుమ్మికి కొంచెం ఇవతల నుంచి నీళ్లని చూసుకుంటూ వచ్చాడు నూకాలు. ఒడ్డుకు దగ్గరగా నీళ్లలో తేలుతూ నిశ్చలంగా ఓ ఆకారం....

ఒళ్లు ఝల్లుమంది. కొద్దిగా భయపడుతూనే ముందుకు వెళ్లాడు నూకాలు. మనిషే, వెల్లకిలా పడుకుని....

తూర్పు దిక్కుగా ఉంది తల. దీర్ఘకేశాలు విడవడిపోయి ప్రవాహానికి అనుగుణంగా చెల్లాచెదురై సుతారంగా కదులుతున్నాయి. నీళ్ల మీదే శవాసనంలో నిశ్చలంగా–అవును ఆ అపరిచితుడే. తల దిక్కున ఉదయిస్తున్న సూర్యుడు, నీళ్లలో శవాసనంలో ఆ ఆగంతకుడు. ఎందుకో ఆ దృశ్యం మనసులో నిలిచిపోయేటట్టు ఉంది.

ఇంతలోనే పెద్దగా కలకలం నీళ్లలో. చటుక్కున నిటారుగా అయ్యాడతడు. లిప్త కూడా ఆలస్యం చేయకుండా మూడు మునకలు వేశాడు. తూర్పువైపు తిరిగి, సూర్యభగవానుడికి అర్ఘ్యం ఇచ్చాడు. ఒడ్డునే నల్ల మట్టిదిబ్బ మీద ఉంది శివాలయం. మట్టిగోడలూ, పైన కంప కప్పుతో నిర్మించినది. తడి అంగవస్త్రంతోనే గుడి ఎదురుగా కూర్చున్నాడు.

ఈ కబురు పట్టుకునే ఉదయం ఆరున్నర గంటల ప్రాంతంలో ఊర్లోకి వచ్చాడు నూకాలు, ''శివాలయం దగ్గర కనిపించారు బాబు!''అంటూ.

కోడి కూయగానే లేచిన సోమమ్మ వీధి తలుపు తీసి, ''బాబూ! నీళ్లు సిద్ధంగానే ఉన్నాయి....'' అని కేకేసింది. గది లోపల ఎవరూ లేరు. పావుగంటలోనే ఆ వీధంతా పాక్కింది ఈ సంగతి. ఆపై మునసబుగారి వీధిలోనూ చిన్న కలకలం.

నిజానికి పెద్ద విషయం కాదు. కానీ పరిస్థితులు అలాంటివి. సాధువులంతా నిజమైన సాధువులు కారు. దొంగలు కాకపోవచ్చు. కానీ రాజ్య వ్యతిరేకులు ఈ వేషంతో వచ్చి ఉండవచ్చు. ఎవరీయన? మొదటిసారి బలంగా ప్రశ్నించుకున్నారంతా? ఎందుకు వచ్చాడు? ఎందుకు వెళ్లిపోయినట్టు, ఎవరికీ చెప్పకుండా? ఆ మౌనం ఎందుకు? మౌనం, లేకుంటే ధ్యానం. నిండా ఇరవైయ్యేళ్లు లేని ఆ మనిషికి ఆ సమ్మోహన శక్తి ఏమిటో!? ఎవరు పలకరించినా, నమస్కరించినా ఒక్క చిరునవ్వే సమాధానం. కానీ ఎంత చక్కని నవ్వు. బయటకు తెలియని ఒక మనిషి ఆయనలో ఉన్నాడు.

వెతకడం మొదలుపెట్టారంతా. అప్పుడే ఆ కబురు తెచ్చాడు నూకాలు.



క్రిష్ణదేవి పేట గ్రామ పెద్ద చిటికెల భాస్కరుడు

కానీ ఈ దుమారం, ఇది తెచ్చిన కలవరం పురాణ పఠనం దగ్గర ఆరోజే పటాపంచలైపోయాయి.

సుందరకాండ నడుస్తోంది. మొదటిసారి అక్కడకు వచ్చాడతడు. అపరిచితుడిని చూసి అన్నారు భాస్కరుడు గౌరవంగా, ''మీరు రెండు మంచిమాటలు చెబితే వినాలని మా అందరి కోరిక!''

ఒక్క నిమిషం మౌనం తరువాత లేచి వచ్చి భాస్కరుడు ఖాళీ చేసిన ఆ జింక చర్మం మీద వ్యాస పీఠానికి ఎదురుగా కూర్చున్నాడు ఆగంతకుడు.

''వందే వాల్మీకి కోకిలం!'' అంటూ నమస్కరించి ఆరంభించాడు.

ఒంటి మీదే ఆరినట్టున్నాయి బట్టలు. జుట్టు పూర్తిగా ఆరి, చిందరవందరగా ఉంది.

అంతా కలిపి ఇరవై నిమిషాలే.

వాల్మీకి రామాయణం, భాస్కర రామాయణాలలోని సుందరకాండల వైభవాన్ని పోల్చి చూపిస్తూ అనర్గళంగా మాట్లాడాడా ఆగంతకుడు.

ఏదో రుషి పరంపరలోని వాడే ఈ యువకుడు అనిపించింది పెద్దలకి. పరవశించిపోయాడు నూకాలు. కానీ వేకువన చూసిన ఆ దృశ్యం గుర్తొచ్చింది, ఏదో శంకను రేపుతూ.

భాస్కరుడు, మరో నలుగురైదురు అతడితో కలిసి ఇంటికి వచ్చారు. అతడిలో అదే మౌనం.

'తమరు ఎవరు?' ఆ ప్రశ్న నాలుక చివరి వరకు వచ్చింది, గుమ్మం దాకా వచ్చిన భాస్కరుడికి. కానీ మాట పెగలలేదు. చివరికి ఏదో మాట్లాడాలన్నట్టు ఈ మాట అన్నారు.

''వేదాంత పంచదశి చదువుతున్నట్టున్నారు! ఒక్కసారి ఇస్తే సాయంత్రమే మళ్లీ మీ చేతికిస్తాను!'' అన్నారాయన.

''సంతోషంగా తీసుకువెళ్లండి అన్నయ్యగారూ!'' అన్నాడు ఆగంతకుడు.

ఆ సంబోధన ఇప్పుడు చాలా ఆనందం, ఇంకాస్త ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.

గదిలో గోడకు తగిలించిన సంచి తీసి రెండు గ్రంథాలు వెలికి తీశాడతడు. ఒకటి వేదాంత పంచదశి. ఇంకొకటి శ్రీమద్భగవద్గీత. అందులో 'వేదాంత పంచదశి– శ్రీ విద్యారణ్య ప్రణీతము'ని అందుకుని కళ్లకద్దుకుని మెరిసే కళ్లతో తెరిచారు భాస్కరుడు.

వ్యాఖ్యాత అన్న చోట బ్రహ్మశ్రీ మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి పేరు ఉంది. దాని కింద కుడి పక్కన ఆ పేరు– ఐదక్షరాలతో.

''ఈపేరు....!?'' ఉత్సుకతతో అడిగారు భాస్కరుడు.

''నాదే!'' చెప్పాడతడు, ప్రశాంతంగా.

''తమరి పూర్వాశ్ర......'' కనుబొమలు ముడిపడుతుండగా అడిగారు భాస్కరుడు.

''నాకు పూర్వాశ్రమం, వర్తమానం వేర్వేరు కావు. నేను సన్యాసిని కాదు.''

''మరి!''

''యాత్రికుడిని. అన్వేషిని.''

''దేనికోసం ఈ యాత్ర? అన్వేషణ?''

''తపోభూమి కోసం. నన్ను నేను తెలుసుకోవడం కోసం!''

''అంటే.... తమరు.....!?'' ఆ పేరు మీద నుంచి దృష్టి మరల్చకనే, ఒక నిగూఢమైన ప్రశ్నను నిక్షిప్తం చేసి అడిగారా మాట. అందులోని ధ్వనిని ఆకళింపు చేసుకుని వెంటనే అన్నాడా యువకుడు.

''ఔను, క్షత్రియులం!'' మళ్లీ అతడే చెప్పాడు. ''ఇంటిపేరు అల్లూరి వారు.. అల్లూరి శ్రీరామరాజు.''

*(తరువాయి భాగం వచ్చేవారం)*

# వావ్‌మెట్...

పనికి రాదని, పాతదైపోయిందని... పక్కన పడేసిన వస్తువుని, ఏదో ఒక అవసరానికి వాడటం అంటే భలే అనిపిస్తుంది. స్టోర్ రూమ్‌లో పాడేసిన పాత హెల్మెట్స్‌తో కూడా ఇంటిని చక్కగా అలంకరించుకోవచ్చు. 'ఎలా'.. అంటారా? గుమ్మం ముందు గుమ్మడి కాయలా వేలాడదీసుకుని... అందులో మొక్కలను పెంచుకుంటే సరికొత్తగా ఉంటుంది. మీకు మరింత కొత్తగా కావాలంటే... లైట్‌కి హెల్మెట్‌ను తగిలించి... బెడ్ లైట్స్‌గానూ మార్చుకోవచ్చు. హెల్మెట్‌ను నచ్చిన షేప్‌లో కట్ చేసుకుని లైట్స్‌కు మోడల్‌గా బిగించుకోవచ్చు. ఇంకాస్త స్టైలిష్‌గా ఉండాలంటే... రంగులతో మీకు వచ్చిన రకరకాల డిజైన్లు వేసి అలంకరణగా నట్టింట్లో పెట్టుకోవచ్చు. ఇలా హెల్మెట్లతో వచ్చే అందాలను చూస్తుంటే వారెవ్వా! అనిపిస్తుంది కదూ.. ఇంకెందుకు ఆలస్యం? బయటకి తీయండి మీ పాత హెల్మెట్లని.

# కిరాకుపుట్టించే 'కీ'

పోష్ లుకింగ్‌కి పోష్ జ్యువలరీ తప్పనిసరి. వేసుకున్న డ్రెస్‌కు ఇప్పుడు 'కీ'ల జ్యువలరీ సరికొత్త లుక్కుని ఇస్తుంది. ఇక్కడ చూడండి. లాకెట్స్, ఇయర్ రింగ్స్, బ్రేస్‌లెట్స్... ఒకటేమిటీ మీకు కావాల్సిన మోడల్‌లో, మీకు కావాల్సిన జ్యువలరీనీ, మీరే తయారు చేసుకోవచ్చు. పొడవాటి గొలుసుకి లాకెట్‌గా వేసుకున్నా... పూసల దండకు పతకంలా మార్చుకున్నా... సన్నటి బెల్ట్‌కు లింక్ చేసుకున్నా..... సూపర్ అనిపిస్తుంది. 'కీ'ని మాత్రమే లాకెట్‌గా వేసుకుంటే... అంత లుక్ రాదనిపిస్తే పూసలను, సిల్క్ క్లాత్‌లను జోడిస్తే సరి.













## ● సాల్వ్ చేస్తారా? శీర్షాసనమేస్తారా?

### ● మాయా బజార్

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | ■ |
| | ■ | | ■ | | ■ | ■ |
| | ■ | 4 | ■ | ■ | 5 | |
| ■ | ■ | 6 | | | | ■ |
| ■ | ■ | | ■ | ■ | ■ | 7 |
| 8 | | | ■ | 9 | | 10 |
| | ■ | ■ | 11 | | ■ | |

**అడ్డం:**

1. 'నా గొంతు శృతిలోనా...' 'నీ చరణం కమలం' 'అదిరింది మామా' 'చిలక పచ్చతోటలో' 'ఎవరిని అడగాలి' పాపులర్ పాటలు ఉన్న నాగార్జున సినిమా (6)
5. తమిళ చిత్రం 'ధూళ్' ఆధారంగా రవిరాజా పినిశెట్టి దర్శకత్వంలో రీమేక్ అయిన రొమాంటిక్ యాక్షన్ కామెడి చిత్రం. రవితేజా, రీమాసేన్, ఆర్తి అగర్వాల్ ప్రధాన పాత్రలు పోషించారు (2)
6. రాజేంద్రప్రసాద్ వీరబాబు, కోటశ్రీనివాసరావు అప్పలకొండగా నటించిన ఈ సినిమాకు...ఎస్వీకృష్ణారెడ్డి దర్శకుడు. (4)
8. 'పాడుతా.....చల్లగా, పసిపాపలా నిద్రపో తల్లిగా బంగారు తల్లిగా' కె.వి.మహాదేవన్ స్వరకల్పనలో ఆత్రేయ రాసిన ఈ పల్లవిలోని ఖాళీని పూరించండి. అటు నుంచి (3)
9. శ్రీను వైట్ల దర్శకత్వంలో ఎన్టీఆర్ నటించిన యాక్షన్ థ్రిల్లర్. ఈ చిత్రానికి కథ...గోపీ మోహన్, కోన వెంకట్, సంగీతం థమన్ (3)
11. 'అమృతం' సీరియల్‌లో నటించి బుల్లితెర ప్రేక్షకులను ఆకట్టుకున్న హాస్య నటుడు. కొన్ని చిత్రాల్లో హాస్య పాత్రలు పోషించిన కీరవాణి సోదరుడు (2)

**నిలువు:**

1. 'నైటింగేల్ ఆఫ్ సౌత్ ఇండియా' 'గాన కోకిల' 'గాన సుధ' 'గాన సరస్వతి' 'క్వీన్ ఆఫ్ సౌత్ ఇండియా'గా గుర్తింపు పొందిన సుమధుర గాయని (3)
2. ఫజిల్ దర్శకత్వంలో నాగార్జున నటించిన చిత్రం. వి.బి.రాజేంద్రప్రసాద్ నిర్మించిన ఈ చిత్రానికి జంధ్యాల సంభాషణలు సమకూర్చారు (3)
3. రాఘవేంద్ర లారెన్స్, వేదిక, రాజ్‌కిరణ్, కోవై సరళ, రాహుల్ దేవ్...ప్రధాన పాత్రలు పోషించిన హారర్ కామెడీ చిత్రం (2)
4. బాలీవుడ్ 'లవ్ ఆజ్‌కల్' రీమేక్‌గా వచ్చిన రోమాంటిక్ డ్రామా చిత్రం. జయంత్ సి.పరాన్జీ దర్శకత్వంలో వచ్చిన ఈ సినిమాలో పవన్ కళ్యాణ్ కథానాయకుడు. కింది నుంచి (4)
5.బాలా దర్శకత్వం వహించిన సినిమా ఇది. పేరులో ఒక్కడే మిగిలాడు (2)
7. సురేష్ కృష్ణ దర్శకత్వంలో రజనీకాంత్ నటించిన సూపర్ హిట్ సినిమా. రజనీకి జోడీగా నగ్మా నటించారు. దేవ సంగీతం సమకూర్చారు (2)
8. రామ్‌గోపాల్ వర్మ దర్శకత్వంలో జగపతిబాబు నటించిన చిత్రం (2)
9. పూరీజగన్నాథ్ రెండో సినిమా, చక్రి తొలి సినిమా (2)
10. మెహర్ రమేష్ దర్శకత్వంలో వెంకటేష్ నటించిన సినిమా (2)

### ● మైథోగ్రఫీ

1. కీచకులలో పెద్దవాడు.



2. పై జవాబులో '3'వ అక్షరంతో...'బలుడు' అనే రాక్షసుడిని సంహరించిన వాడు.



3. చిత్రాంగద కొడుకు... 2వ జవాబులో మొదటి అక్షరంతో..



4. ఆంజనేయుడు... పై జవాబులో '4'వ అక్షరంతో...



5. విష్ణుమూర్తి... 4వ జవాబులో '1' అక్షరంతో...



### ● బ్రెయిన్ జిమ్

1. మనల్ని పట్టేస్తుంది. మనం మాత్రం పట్టలేము. ఏమిటది?
2. 'వన్'కు ఒక అక్షరం చేర్చి, మాయం చేయండి.
3. పిడి కాని పిడి
4. ఎరుపు బ్యాంకులో ఎర్రని రత్నాలు

| | | | | |
|---|---|---|---|---|
| జ | లు | బు | డి | దా |
| స | ర | పి | మా | ని |
| ప | పా | న్నీ | క | మ్మ |
| G | ఖ | D | H | S |
| G | O | N | E | R |

### జవాబులు

**● మాయా బజార్**

**అడ్డం:** 1. జానకిరాముడు 5. వీడే 6. మాయలోడు 8. తీయగా 11. కాంచి

**నిలువు:** 1.జానకి 2. కిల్లర్ 3. ముని 4. తీన్‌మార్ 5. వీడు 7. బాషా 8. గాయం 9. బాచి 10. షాడో

**● మైథోగ్రఫీ**

1. సింహబలుడు 2. బలసూదనుడు 3. బభ్రువాహనుడు 4. హనుమంతుడు 5. హరి

**● బ్రెయిన్ జిమ్**

| | | | | |
|---|---|---|---|---|
| జ | లు | బు | డి | దా |
| స | ర | పి | మా | ని |
| ప | పా | న్నీ | క | మ్మ |
| G | ఖ | D | H | S |
| G | O | N | E | R |

### ● కిసుక్కు



యస్.ఐ: బ్లాక్‌లో టికెట్లు అమ్మేవాడిని పట్టుకు రమ్మంటే ఒక్కడివి వచ్చేవేం?

కానిస్టేబుల్: అక్కడ టికెట్లన్నీ బ్లాక్‌లో కాదు పసుపు, గులాబీ రంగుల్లో అమ్ముతున్నారు సార్.

– జి.క్రాంతి, కాకినాడ

### ● మీకు తెలుసా



మిక్కీ మౌస్ అసలు పేరు 'మార్టిమర్ మౌస్' అయితే... ఈ పేరు వాల్ట్ డిస్నీ భార్య లిలియన్‌కు నచ్చకపోవడంతో... పేరు మార్చమని సూచించిందట.



## పదశోధన - 422

నిర్వహణ : **అదృష్టదీపక్**

**ఆధారాలు**

**అడ్డం**

1. శ్వాస (3)
3. ఇది బ్రహ్మవాక్కు అంటారు (4)
6. శిరస్సు (2)
7. వ్యవహారంలో జైలు ఊచలు (5)
10. మందు పుచ్చుకున్న యజమాని, భూస్వామి (3)
11. చెరసాల (2)
12. చాటింపు, దండోరా (3)
14. సంక్రాంతికి ముద్దుల మూట కట్టే పుష్పాలు (7)
17. దగ్గర, తీరం (2)
18. నాలుగు ప్లస్ ఒకటి (2)
19. నుదుటి బొట్టు (3)
21. పెద్దపులి ఆయుధం (2)
23. జింక (2)
24. జీవిత కాలం, వయస్సు (3)
25. పక్షి అరుపు (2)
26. తల లేని నియంత (2)
27. వాయువు (2)
28. సూదంటు రాయి (4)

**నిలువు**

1. ఆలోచన (2)
2. చిన్న కొమ్మ (3)
3. జెండా (3)
4. వంతు, భాగం (2)
5. వద్దు వద్దని గ్రాంథికంలో చెప్పండి (6)
6. చీకటి (2)
7. బొప్పి, దెబ్బ తగిలిన చోట కలిగిన వాపు (3)
8. ఒక మందు మొక్క, అలోవెరా (4)
9. పైకి లేచిన పేజీలు (3)
10. కావు కావుమని అరిచే పక్షులు (3)
13. వేషం మార్చిన ముగ్గురు (3)
15. భిక్షం, యాచన (3)
16. ఇది ధూర్త లక్షణం అంటారు (5)
18. ప్రేమికుల భాషలో వన్ ఫోర్ త్రీ (3)
20. ఎటు విసిరినా వచ్చే బంతి (3)
22. తల్లితో వచ్చిన అల్లుడు (3)
24. తెలుగువారి మనసు కవి (3)
25. కాయకష్టం చేసి సంపాదించిన డబ్బు (2)

**పదశోధన - 421 జవాబు**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) ఉ | డు | (2) త | | | (3) శు | (4) భా | (5) కాం | క్ష | (6) లు |
| డు | | మ | | (7) మే | | (8) గ | తి | | గ |
| (9) కు | శ | ల | వు | లు | | హో | | | ప |
| నె | | పా | | (10) క్రొ | మ | రం | (11) భీ | మ్ | |
| (12) త్తు | (13) క | కు | | లు | | | తి | | (14) వి |
| (15) రు | మా | లు | | (16) పు | (17) రు | (18) గు | | (19) వి | రి |
| | ను | | (20) శు | | (21) ష | ర | (22) తు | | వి |
| (23) తా | | (24) వై | భ | వం | | (25) క | ల | హం | |
| (26) ర | (27) మ | | వే | | (28) ఏ | | సి | | (29) పా |
| (30) క | ర | తా | ళ | ధ్వ | ను | లు | | (31) తూ | ము |

## • టేస్టీ టెస్ట్

**నిలువు:** 1. ఈ రొట్టె రుచిగా ఉండడమే కాదు... ఎముకల పుష్టికి కూడా ఎంతో ఉపయోగపడుతుంది.

3. ఈ చికెన్ పేరులో కొండ దాగుంది. నీలం దాగుంది. అన్నిటికీ మించి చక్కని రుచి దాగుంది. పాలకూర, పుదీన కలిసిన చికెన్ ఇది.

5. మజా రావాలంటే ఇది ఉండాల్సిందే... గరం గరంగా ఉండాల్సిందే... ఏమిటిది?

**అడ్డం:**

2. బిర్యానీల్లో ఈ '....బిర్యానీ' వేరయా!

4. వీటి 'దుంప' తెగ! ఎంత స్వీటు టేస్టో!! (అటు నుంచి)

6. 'మటన్' పన్నీర్ కాదండీ బాబూ... పచ్చటి బఠానీల మహా టేస్టీ పన్నీర్. (అటు నుంచి)

**జవాబు**

నిలువు: 1. జొన్నరొట్టె 3. నీలగిరి చికెన్ 5.గరంమసాలా
అడ్డం: 2. రొయ్యల బిర్యానీ
4. చిలగడదుంప హల్వా 6. మటర్ పన్నీర్

## సుడోకు - 182

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 7 | | 4 | | 3 | 8 |
| | | 4 | 3 | 1 | | | | |
| 3 | 5 | | | | 9 | | | 4 |
| 4 | | | 2 | | | 8 | | 3 |
| | 8 | | | 7 | | | 9 | |
| 2 | | 5 | | | | | | 6 |
| 5 | | | 9 | | | | 8 | 1 |
| | | | | 4 | 1 | 6 | | |
| 9 | 1 | | 6 | | 3 | | | |

కఠిన స్థాయి 1 2 3 4 5

**సుడోకు 181 జవాబు**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 | 8 | 7 | 2 | 9 | 6 | 5 | 3 | 1 |
| 2 | 6 | 9 | 3 | 5 | 1 | 8 | 7 | 4 |
| 3 | 1 | 5 | 8 | 7 | 4 | 2 | 6 | 9 |
| 8 | 5 | 4 | 9 | 1 | 3 | 6 | 2 | 7 |
| 6 | 9 | 2 | 7 | 4 | 5 | 1 | 8 | 3 |
| 1 | 7 | 3 | 6 | 2 | 8 | 9 | 4 | 5 |
| 9 | 3 | 1 | 4 | 8 | 2 | 7 | 5 | 6 |
| 5 | 4 | 8 | 1 | 6 | 7 | 3 | 9 | 2 |
| 7 | 2 | 6 | 5 | 3 | 9 | 4 | 1 | 8 |

# 5 ఫిబ్రవరి నుంచి 11 ఫిబ్రవరి 2017 వరకు

సింహంభట్ల సుబ్బారావు
జ్యోతిష్య పండితులు





**మేషం:** (అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)
ఆర్థికపరమైన ఇబ్బందులు చికాకులు తప్పవు. బంధువులు, మిత్రుల నుంచి ఒత్తిడులు. విమర్శలు తప్పవు. ఆరోగ్యంపై శ్రద్ధ చూపండి. పనులలో అవరోధాలు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. వ్యాపార లావాదేవీలు కొంత నిరాశాజనకం. ఉద్యోగులకు పనిభారం మరింతగా పెరుగుతుంది. పారిశ్రామికవర్గాలకు పర్యటనలు వాయిదా. వారం చివరిలో కొంత అనుకూలత. పసుపు, నేరేడు రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. దుర్గామాతకు అర్చన చేయండి.



**వృషభం:** (కృత్తిక 2,3,4 పా, రోహిణి, మృగశిర 1,2 పా.)
ఉత్సాహంగా కార్యక్రమాలు పూర్తి చేస్తారు. ఆలోచనలు కలసివస్తాయి. ప్రత్యర్థులు మిత్రులుగా మారతారు. ఆత్మీయుల నుంచి పిలుపురావచ్చు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. ఆరోగ్యపరంగా చికాకులు. మీ నిర్ణయాలు ఆశ్చర్యపరుస్తాయి. వ్యాపారాలు అభివృద్ధిబాటలో సాగుతాయి. ఉద్యోగులకు  కీలక సమాచారం అందుతుంది. రాజకీయవర్గాలకు పదవులు తథ్యం. తెలుపు, చాక్లెట్ రంగులు. తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణాలయ దర్శనం మంచిది.



**మిథునం:** (మృగశిర 3,4, ఆరుద్ర, పునర్వసు 1,2,3 పా.)
వ్యయప్రయాసలతో కొన్ని కార్యక్రమాలు పూర్తి చేస్తారు. ఆలోచనలు అంతగా కలిసిరావు. కుటుంబంలో సమస్యలు కొంతమేరకు పరిష్కారం. ఆరోగ్యం మందగిస్తుంది. బంధువులు,మిత్రులతో విభేదాలు నెలకొంటాయి. సంఘంలో గౌరవానికి లోటు ఉండదు. ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా ఉంటుంది. వ్యాపారాలలో లాభాలు స్వల్పంగా ఉంటాయి. ఉద్యోగులకు అదనపు బాధ్యతలు. కళాకారుల యత్నాలు నిరాశ కలిగిస్తాయి. ఆకుపచ్చ, బంగారు రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశాష్టకం పఠించండి.



**కర్కాటకం:** (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)
కొత్త పనులు ప్రారంభించి సకాలంలో పూర్తి చేస్తారు. ఆత్మీయులు,బంధువులతో సఖ్యత నెలకొంటుంది. ఆస్తి వ్యవహారాలలో చిక్కులు తొలగి ఊరట చెందుతారు. వాహన,గృహయోగాలు. ముఖ్య నిర్ణయాలు తీసుకుంటారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు అనుకున్న హోదాలు దక్కుతాయి. రాజకీయవర్గాలకు విదేశీ పర్యటనలు. ఎరుపు, గులాబీ రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. హనుమాన్‌ఛాలీసా పఠించండి.



**సింహం:** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)
ఈవారం పట్టింది బంగారమే. ఆశించినంత  ఆదాయం. కొన్ని సమస్యలు పరిష్కరించుకుంటారు. ఆహ్వానాలు అందుతాయి. ఉద్యోగయత్నాలు అనుకూలిస్తాయి. ప్రత్యర్థులు కూడా మీ దారికి వస్తారు. కార్యక్రమాలలో విజయం. వాహనయోగం. శుభకార్యాల నిర్వహణలో బిజీగా గడుపుతారు. పాతమిత్రులను కలుసుకుంటారు. వ్యాపారాలలో కొత్త పెట్టుబడులకు అనుకూలం. ఉద్యోగులకు పదోన్నతులు. పారిశ్రామికవర్గాలకు ఊహించని ప్రగతి. ఎరుపు, లేతపసుపు రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. శివాష్టకం పఠించండి.



**కన్య:** (ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1,2 పా.)
కుటుంబానికి సంబంధించి తీసుకునే నిర్ణయాలు అందరి ఆమోదం పొందుతాయి. రాబడి ఉత్సాహాన్నిస్తుంది. పలుకుబడి పెరుగుతుంది. సోదరులు,మిత్రులతో ఆనందంగా గడుపుతారు. విద్యార్థులు,నిరుద్యోగులకు శుభవార్తలు అందుతాయి. వివాహాది శుభకార్యాలు నిర్వహిస్తారు. వ్యాపారాలు లాభసాటిగా ఉంటాయి. ఉద్యోగులకు ఉన్నతహోదాలు. రాజకీయవర్గాలకు సంతోషకరమైన సమాచారం. ఆకుపచ్చ, తెలుపు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.



**తుల:** (చిత్త 3,4, స్వాతి, విశాఖ1,2,3 పా.)
ఆదాయానికి మించి ఖర్చులు. పనులు మధ్యలోనే విరమిస్తారు. ఆలోచనలలో అస్థిరత. ఇంటాబయటా సమస్యలు చికాకు పరుస్తాయి. శ్రమ మీద ఫలితం వేరొకరిదిగా ఉంటుంది. నిర్ణయాలలో నిదానం అవసరం. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. పాతమిత్రులను కలుసుకుంటారు. వ్యాపారాలు లాభిస్తాయి. ఉద్యోగులు మరింత శ్రద్ధ వహించాలి. రాజకీయవర్గాలకు ఒత్తిడులు. నీలం, ఆకుపచ్చరంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. దేవీస్తుతి మంచిది.



**వృశ్చికం:** (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)
ఆర్థిక వ్యవహారాలలో హామీలు వద్దు. ఇతరుల విమర్శలకు తలవొగ్గడం ఉత్తమం. పనులు వాయిదా వేస్తారు. రాబడి తగ్గినా అవసరాలు తీరతాయి. ప్రముఖుల నుంచి అందిన సమాచారం ఊరట కలిగిస్తుంది. సోదరుల ద్వారా ఆశించిన సహాయం అందుతుంది. వ్యాపారాలు మందకొడిగా సాగుతాయి. ఉద్యోగులకు పనిభారం. రాజకీయవర్గాలకు పర్యటనలు రద్దు. ఎరుపు, నేరేడు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. కనకధారాస్తోత్రం పఠించండి.



**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)
కొత్త పనులకు శ్రీకారం చుడతారు. ఆత్మీయులతో ఉత్సాహంగా గడుపుతారు. సేవాకార్యక్రమాలపై దృష్టి సారిస్తారు. వాహనాలు, భూములు కొనుగోలు చేస్తారు. ఆలోచనలు అమలులో పెడతారు. నిరుద్యోగులు, విద్యార్థుల యత్నాలు సఫలం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వ్యాపారాలు అభివృద్ధిబాటలో సాగుతాయి. ఉద్యోగులకు ప్రమోషన్లు. కళాకారులకు పురస్కారాలు. పసుపు, ఆకుపచ్చ రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. దత్తస్తోత్రాలు పఠించండి.



**మకరం:** (ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)
నిరుద్యోగులకు శుభవార్తలు అందుతాయి. చేపట్టిన కార్యక్రమాలు సజావుగా పూర్తి చేస్తారు. ఆత్మీయులు ఆదరణ చూపుతారు. కొన్ని ముఖ్య నిర్ణయాలు తీసుకుంటారు. వివాహాది శుభకార్యాలకు హాజరవుతారు. తీర్థయాత్రలు చేస్తారు. సంఘంలో గౌరవం మరింతగా పెరుగుతుంది. వాహనయోగం. కొన్ని వివాదాలు తీరి ఊరట చెందుతారు. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు పనిభారం తగ్గే అవకాశం. కళాకారులకు ఒక అవకాశం ఉత్సాహాన్నిస్తుంది.  నీలం, నేరేడు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. గణపతి అర్చన చేయండి.



**కుంభం:** (ధనిష్ఠ 3,4, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా.)
కొన్ని కార్యక్రమాలు హఠాత్తుగా విరమిస్తారు. ఆర్థిక ఇబ్బందులు, ఆరోగ్య సమస్యలు చికాకు పరుస్తాయి. శ్రమ తప్ప ఫలితం కనిపించదు. ఆలోచనలు నిలకడగా ఉండవు. బంధువులను కలుసుకుని ముఖ్య విషయాలు చర్చిస్తారు. విద్యార్థులు,నిరుద్యోగులకు ఒత్తిడులు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. వ్యాపారాలలో నిదానం అవసరం. ఉద్యోగులకు కొత్త బాధ్యతలు. రాజకీయవర్గాలకు కొంత వరకూ అనుకూలం. పసుపు, నలుపురంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. పంచముఖ ఆంజనేయస్తోత్రాలు పఠించండి.



**మీనం:** (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)
అనుకున్న ఆదాయం సమకూరక ఇబ్బందులు. ఆలోచనలు కలిసిరావు. ఇంటాబయటా ఒత్తిడులు పెరుగుతాయి. కొన్ని కార్యక్రమాలలో అవాంతరాలు. దూరపు బంధువులను కలుసుకుంటారు. ఆరోగ్యం కొంత మందగిస్తుంది. వ్యయప్రయాసలు తప్పకపోవచ్చు. నిరుద్యోగులకు కొత్త ఆశలు. తీర్థయాత్రలు చేస్తారు. వ్యాపారాలు కొంత నిరాశ కలిగిస్తాయి. ఉద్యోగులకు చికాకులు. పారిశ్రామికవర్గాలకు సమస్యలు ఎదురుకావచ్చు. గులాబీ, లేత ఎరుపురంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. నవగ్రహస్తోత్రాలు పఠించండి.

• టారో

5 ఫిబ్రవరి నుంచి 11 ఫిబ్రవరి 2017 వరకు












టారో ఇన్సియా
అనలిస్ట్

**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 19)**

కోల్పోయిన వైభవాన్ని తిరిగి తెచ్చిచ్చే వారమిది. పనిప్రదేశంలో కొంచెం అసౌకర్యం కలగవచ్చు. అందరూ మీకు అనుకూలంగా ఉండటం వల్ల అవరోధాలనూ అధిగమిస్తారు. అదనపు బాధ్యతలు మీద పడతాయి. పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించడం మంచిది. మీ జీవితాన్ని మలుపు తిప్పబోయే కొత్త అవకాశం మీ తలుపు తట్టబోతోంది.

**కలిసొచ్చే రంగు: మావిచిగురు**

**వృషభం (ఏప్రిల్ 20 - మే 20)**

కొత్తబంధాలు, బంధుత్వాలు కలుస్తాయి. భావోద్వేగాలు చుట్టుముడతాయి. మీ తెలివితేటలను ఉపయోగించి, ప్రాక్టికల్‌గా ఉండటం అలవాటు చేసుకోవడం మంచిది. చేసే పనిని మరింత లోతుగా, శ్రద్ధగా చేయడం అవసరం. మీ సంభాషణా చాతుర్యంతో అందరినీ ఆకట్టుకుంటారు. పనులు పూర్తి చేసుకోగలుగుతారు. మీ కష్టసుఖాలను జీవిత భాగస్వామితో చెప్పుకోవడం వల్ల మేలు కలుగుతుంది.

**కలిసొచ్చే రంగు: ముదురాకుపచ్చ**

**మిథునం (మే 21 - జూన్ 20)**

ఈ నెల మీకు అదృష్టాన్ని తెచ్చిపెడుతుంది. అధికార యోగం లేదా పదవీయోగం కలుగుతుంది. అందుకు సంబంధించిన వార్తలు వింటారు. ఇంతకాలం మీరు కష్టపడి చేసిన పనులకు గుర్తింపు, పేరు ప్రఖ్యాతులు వస్తాయి. మీ ఉన్నతిని చూసి ఓర్వలేక చాటుగా విమర్శించేవారు ఎక్కువ అవుతారు. ధైర్యంగా ఎదుర్కొనడం మంచిది. వాహన యోగం ఉంది. కొత్త మిత్రులు పరిచయం అవుతారు.

**కలిసొచ్చే రంగు: నీలం**

**కర్కాటకం (జూన్ 21 - జూలై 22)**

ఈవారం మీరు మాట్లాడే ప్రతిమాటా నిజం అవుతుంది. పనులు ఆలస్యం అవవచ్చు. పాత ఆలోచనలనే అమలు చేస్తారు.. కీలకమైన ఒక ప్రాజెక్టును చేపట్టడం లేదా కొత్తవారితో పని చేయవలసి రావడం జరగవచ్చు. సృజనాత్మకంగా చేసే పనులు విజయవంతమవుతాయి. మీ ముందు మంచిగా మాట్లాడుతూనే, వెనకాల గోతులు తవ్వేవారు ఉండవచ్చు. జాగ్రత్త.

**కలిసొచ్చే రంగు: బూడిదరంగు**

**సింహం (జూలై 23 - ఆగస్ట్ 22)**

మీ ఆశలను, ఆశయాలను సాధించడానికి కొత్తప్రదేశాలకు వెళ్లవలసి వస్తుంది. దూరప్రయణాలు చేస్తారు. లాభదాయకమైన వ్యాపారాన్ని చేపడతారు. వ్యాపారావకాశం వచ్చినప్పుడు దానిని అందుకోవడానికి వెనుకంజ వేయవద్దు. మీ బాధ్యతలను స్వీకరించడానికి సరైన వ్యక్తులను అన్వేషించవలసి వస్తుంది. కాలం అన్ని గాయాలనూ మాన్పుతుంది. మీ భాగస్వామి సహకారం లభిస్తుంది.

**కలిసొచ్చే రంగు: వెండి**

**కన్య (ఆగస్ట్ 23 - సెప్టెంబర్ 22)**

ఆఫీస్‌లో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. అన్ని అననుకూలతలనూ అధిగమిస్తారు. ఎప్పుడో సాధించిన విజయానికి ఇప్పుడు విందుకు ఆహ్వానం అందడమో లేదా మీరు ఇవ్వడమో జరుగుతుంది. స్నేహితునికి అండగా నిలబడవలసి వస్తుంది. మీ త్యాగానికి తగిన ప్రతిఫలం లభిస్తుంది. మీ ప్రతిభాసామర్థ్యాలకి గుర్తింపు కోసం మరింత కష్టపడాలి.

**కలిసొచ్చే రంగు: ముదురాకుపచ్చ**

**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 22)**

విశ్రాంతిగా గడపడానికి, విహారానికి లేదా పిక్‌నిక్‌కు వెళ్లడానికి ఇది తగిన సమయం. కొత్త స్నేహితులు ఏర్పడతారు. మీరు పర్యటనకు వెళ్లడానికి ముందే మీ పనులన్నీ పూర్తి చేసుకుని ఉండటం మంచిది. అనవసరమైన ఆందోళనలు, ఆత్మన్యూనతలు పక్కనబెట్టి హాయిగా గడపండి. మీ ఆలోచనలకు, సృజనాత్మకతకు మెరుగులు దిద్ది, మీరేమిటో నిరూపించుకోండి.

**కలిసొచ్చే రంగు: నారింజ**

**వృశ్చికం (అక్టోబర్ 23 - నవంబర్ 21)**

మీ ఆలోచనలేమిటో మీరు అన్నది ఈ వారం మీ విషయంలో అక్షరాలా వర్తిస్తుంది. మీ పని విషయంలో సలహా లేదా సహాయం కావాలనుకోండి, తటపటాయించకుండా మీ మార్గదర్శిని కలిసి సలహా తీసుకోండి లేదంటే చిక్కుల్లో పడతారు. కుటుంబానికి తగిన ప్రాధాన్యత ఇవ్వండి. కొత్త పథకాలలో పెట్టుబడులు పెడతారు. ఆదాయాన్ని కళ్లచూస్తారు. మీ సహోద్యోగులు కూడా మీ బాటలోనే నడుస్తారు.

**కలిసొచ్చే రంగు: లేత నారింజ**

**ధనుస్సు (నవంబర్ 22 - డిసెంబర్ 21)**

ఉద్యోగంలో, పనిలో లేదా వృత్తిలో ఇంత కాలం మీరు ఎదురు చూస్తున్న మార్పు ఇప్పుడు వస్తుంది లేదా మీరు ఆశించిన మార్పును ఆమోదించడానికిది తగిన సమయం. ఈ మార్పు కాలంలో స్నేహితులతో సరదాగా కాసింత సేద తీరడం అవసరం. మొహమాటానికి పోయి మీ బంధుమిత్రులలో ఒకరికోసం ఇప్పటికే చాలా ఎక్కువ ఖర్చుచేశారు. ఇప్పటికైనా తెలుసుకోకపోతే మునిగిపోతారు.

**కలిసొచ్చే రంగు: చాకొలేట్**

**మకరం (డిసెంబర్ 22 - జనవరి 19)**

ఈ వారం విందు వినోదాలలో గడుపుతారు. పనిలో విసుగు అనిపించినా, చేయవలసి రావడంతో నాణ్యత లేక నష్టపోతారు. వ్యాపారులకు లాభాలు కొంచెం నెమ్మదిగా అందుతాయి. మీ జీవిత భాగస్వామి లేదా ప్రియమైన వారితో ఆనందంగా గడుపుతారు. విలువైన బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. పనిలో మెలకువ లేకపోతే మాట పడక తప్పదు.

**కలిసొచ్చే రంగు: మెరిసే పసుపు రంగు**

**కుంభం (జనవరి 20 - ఫిబ్రవరి 18)**

మంచి కెరీర్, ఉన్నతమైన ఉద్యోగం లేదా హోదా కావాలనుకున్నప్పుడు కుటుంబం గురించిన ఆలోచనలు పక్కన పెట్టాలి. అప్పుడే మీరు జీవితంలో గెలుపొందే అవకాశాలు దక్కుతాయి. ఉత్సాహంతో ఉంటారు. ఆర్థిక విషయాల మీద దృష్టిపెట్టండి, మేలు జరుగుతుంది. పనిమీద మరికాస్త శ్రద్ధ అవసరం. మీ చిరకాల కోరిక ఒకటి ఈ వారాంతంలో తీరనుంది.

**కలిసొచ్చే రంగు: ముదురు గోధుమ**

**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20)**

అనుకోకుండా కొత్తవారిని కలుసుకుంటారు. శుభవార్తలు వింటారు. అదృష్టం వరిస్తుంది. ఈ వారమంతా మీకు సంభ్రమాశ్చర్యాలు కలిగించే సంఘటనలు ఎదురవుతుంటాయి. కెరీర్ కొత్తమలుపు తిరుగుతుంది, విద్యార్థులకు యోగించే కాలమిది. యాంత్రికంగా కాక, శ్రద్ధాసక్తులతో చేస్తేనే పనులు విజయవంతమవుతాయని గ్రహించండి. కీలక నిర్ణయాలు తీసుకుంటారు.

**కలిసొచ్చే రంగు: తెలుపు, లేత గులాబీ**

# స్వెటర్... బెటర్!

‘‘ఎలాగూ కాసిన్ని రోజుల్లో చలికాలం వెళ్లిపోబోతోంది. పెద్ద పెద్ద వాళ్లకు ట్విట్టరు కామెంట్ పెట్టడం అన్నది ఎలాగైతే స్టేటస్‌కు సంబంధించిన అంశమో.... మనలాంటి మధ్యతరగతి వాళ్లకు స్టైలుకొట్టే స్టేటస్‌ను ప్రసాదిస్తుందిరా స్వెట్టర్! కానీ ఆ భోగం, వైభోగం ఇంకా కొద్ది రోజులే కదా’’ అంటూ ఏదో తాత్విక ధోరణిలో మాట్లాడుతూ, బాధపడుతూ ఉండగా మా రాంబాబు గాడిని కలిశాను నేను.

‘‘ఏమైంద్రా అంత బాధగా ఉన్నావ్?’’ అడిగా.

‘‘కొన్ని డ్యామేజీల నుంచి సైలెంటుగా పరువును కాపాడే అతి గొప్ప వస్త్రవిశేషమైన స్వెట్టరుకు ఇవే నా జేజేలు’’ అంటూ కాస్త ఆవేశపడ్డాడు రాంబాబు.



‘‘స్వెట్టరు వేసుకునేది గడగడ వణికించే చలిలో కాస్త వేడిగా. కంఫర్ట్‌గా ఉండటం కోసం. అంతే. దాంతో దక్కే పరువేమిట్రా బాబూ కొత్తగా?’’ అడిగా.

‘‘నీకు తెలియదు ఉరుకో. స్వెటర్ పరువు కాపాడే తీరే వేరురా. నాకు కొన్ని షర్ట్స్ ఉన్నాయి. వాటిల్లో కొన్నింటికి చంకలో కాస్త కుట్లు ఊడిపోయి ఉండటమో, మధ్య బటన్ ఊడితగలడటమో వంటి అనర్థాలు జరిగి కొంత కొంత లోపాలుండటంతో తక్షణం తొడగలేని చొక్కాలవి. అయితే ఆ చొక్కల బొక్కలను కప్పేస్తూ ఎలాగూ మన స్వెట్టరు తొడిగేస్తాం కాబట్టి మన స్వెటర్ చలి నుంచి రక్షించడం అన్న ప్రాథమిక బాధ్యతను మాత్రమే గాక... పరువు పోకుండానూ అనుబంధ బాధ్యతలనూ నిర్వహిస్తుంటుంది. అంతటి సౌకర్యం ఉన్న ఆ స్వెట్టరును నాల్రోజుల్లో మూలకు పడేయాల్సి వస్తోంది కదా అని కాస్త విచారంగా ఉంది. నిజానికి దాన్ని మడతేసి వచ్చే ఏడాది దాకా బీరువాలో పెడుతున్నందుకు కాదు బాధ. అది లేనందువల్ల మరో నాలుగు షర్ట్‌లు.... రిపేరు చేయించే వరకూ అందుబాటులో ఉండవు కదా అన్నదే రా నా దిగులు’’ అన్నాడు రాంబాబు

‘‘పోన్లే ఆ త్వరగా ఆ నాలుగు షర్టులూ రిపేరు చేయించుకో. ఎప్పటికైనా తప్పదు కదా’’ అంటూ ఓదార్చబోయాన్నేను.

‘‘నో... నో... ఎలాగూ ఆ తర్వాత కూడ మన కల్చరల్ ఎలిమెంటు అయిన ఆ మహనీయ స్వెటర్‌ను అలాగే కంటిన్యూ చేద్దామని నా ఉద్దేశం’’ అన్నాడు వాడు.

‘‘అది మన కల్చరల్ ఎలిమెంటా?’’ఆశ్చర్యంగా అడిగా.

‘‘అవును రా... స్వెటర్ మన సంప్రదాయ వస్త్ర విశేషం. సాంస్కృతిక చిహ్నం’’ ఏమాత్రం తొణక్కుండా జవాబిచ్చాడు.

‘‘అదెలా? స్వెటర్ అన్నది విదేశీయుల వస్త్రవిశేషం కదా’’

‘‘అప్పుడెప్పుడో పూర్వకాలం నుంచి గొంగడి కప్పుకోవడం అన్నది మన సంస్కృతిలో భాగం. పశువులను కాయడానికి వెళ్లేవాళ్లూ, పొలానికి కాపలా పడుకునేవారూ గొంగడిని వాడటం నీకు తెలియదా? మరప్పుడు అది మన సాంస్కృతిక, సాంప్రదాయక వస్త్రవిశేషం కాకుండా ఎలా ఉంటుంది’’

‘‘గొంగడి మాట నేను మాట్లాడటం లేదు. నువ్వు స్వెటర్‌ను మన సంప్రదాయ వస్త్రం అంటున్నావు కదా. ఆ విషయం నాకు అర్థం కావడం లేదు’’

‘‘పిచ్చివాడా... స్వెటర్ అంటే ఏమనుకుంటున్నావు. గొంగడి తాను తీసుకొని చొక్కా రూపంలో కుట్టిస్తే అది స్వెటర్ అయినట్టే కదా! నీకో సత్యం చెబుతా విను. కుట్టిస్తే స్వెటర్... వదిలేస్తే గొంగళి... కావాలనుకుంటే ఇప్పట్నుంచి గద్దర్‌గారు గొంగళికి ప్రత్యామ్నాయంగా స్వెటర్ వాడొచ్చు. అంతగా తొడుక్కోవడం ఇష్టం లేదనుకో. హ్యాపీగా భుజం మీద వేసుకోవచ్చు. అప్పుడది అచ్చం గొంగళిలాగే కనిపిస్తుంది. కాకపోతే బ్లాక్ కలర్ గొంగళి క్లాత్‌తో కుట్టిస్తే మేలు. నాకు ఇంకో ఆలోచన కూడా వచ్చింది రా. అదే జరిగి ఉంటే అసలు కురుక్షేత్ర మహాభారత యుద్ధమే జరిగి ఉండేదికాదు’’

‘‘ఏమిట్రా... ఇతిహాసాన్నే నివారించేంత అంత గొప్ప ఐడియా?’’ అంతులేని ఆశ్చర్యంతో అడిగా.

‘‘ఏం లేదురా.... ఒరేయ్... అలనాటి వస్త్రాపహరణం టైమ్‌లో ద్రౌపది గనక స్వెటర్ తొడుక్కొని ఉండి ఉన్నట్లయితే, లాగడానికి కొంగూ ఉండదు. గుంజడానికి చెంగూ దొరకదు. దాంతో దుశ్శాసనుడు అసలు వస్త్రాపహరణమే చేయలేకపోయేవాడు. దాంతో పాండవులకు అవమానమూ, మనకు మహాభారత యుద్ధమూ తప్పేవి. పైగా ఇన్సిడెంటు జరిగింది ఢిల్లీలోనే కాబట్టి అక్కడ కూలింగ్ ఎక్కువగానే ఉండేది కదా. ద్రౌపదికి అటు చలీ తప్పేది... ఇటు పాండవులకు అవమానమూ తప్పేది. దాంతో యుద్ధమూ తప్పేది’’ చెప్పాడు రాంబాబు.

‘‘ఒరేయ్... ఒక ఐడియా జీవితాన్ని మార్చేస్తుందని విన్నాను... గానీ నీ ఐడియా యుద్ధాన్నే తప్పించేదని ఇప్పుడే నాకు తెలిసింది రా. కానీ ఇలా తప్పుడు ఇమేజినేషన్స్ చేస్తుంటే నీ ఇమేజి దెబ్బతింటుంది చూడు’’ అంటూ హెచ్చరించాడు వాణ్ణి.

**- యాసీన్**

**• కిసుక్కు**



సుమిత్ర: మీవారు కనిపించడం లేదని పేపర్ ప్రకటన ఇచ్చావు కదా! రెస్పాన్స్ వచ్చిందా?

సునీత: ఆ వచ్చింది. ఆయనకు అప్పు ఇచ్చినవాళ్లంతా నన్ను పట్టుకున్నారు.

– సిహెచ్‌వివిఎస్‌మూర్తి, పాల్వంచ

**• మీకు తెలుసా**



భయాలు పలు రకాలు. కోళ్లను చూసి భయపడేవాళ్లు కూడా ఉన్నారు. ఈ భయాన్ని ‘ఎలెక్ట్రోఫోబియా’ అంటారు.



## • పట్టుకోండి చూద్దాం




### అక్కడ

సరోజ పెద్దగా అరుస్తుండడంతో చుట్టు పక్కలవాళ్లు పరుగెత్తుకు వచ్చారు.

''అయ్యో... ఇలా చేస్తాడనుకోలేదు'' అని నెత్తి నోరు బాదుకుంటోంది సరోజ.

ఇంతలో సంఘటన స్థలికి పోలీసులు వచ్చారు. మృతుడి షర్ట్‌పై సూయిసైడ్ నోట్ పిన్ చేసి ఉంది.

'జీవితం మీద ఆసక్తి పోయింది' అనే వాక్యం సూయిసైడ్ నోట్‌లో ఉంది. తన డైరీలోని ఒక పేజీనే సూయిసైడ్ నోట్‌గా చేసుకున్నాడు రవికిరణ్.

సూయిసైడ్ నోట్‌లో ఉంది రవికిరణ్ హ్యాండ్ రైటింగే అనేది దర్యాప్తులో తెలిసిపోయింది.

''మీ ఆయన ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడు? ఆయనకు ఏమైనా సమస్యలు ఉన్నాయా? లేక మీ ఇద్దరు ఏమైనా గొడవ పడ్డారా?'' అని అడిగాడు ఇన్‌స్పెక్టర్.

''మేము చిలకాగోరింకల్లా ఉంటామని ఎవరిని అడిగినా చెబుతారు. ఆయనకో సమస్య ఉంది'' కళ్లు తుడుచుకుంటూ చెప్పింది సరోజ.

''ఏమిటా సమస్య?'' ఆసక్తిగా అడిగారు ఇన్‌స్పెక్టర్.

''ఆయన రెండు సంవత్సరాలుగా డిప్రెషన్ బాధ పడుతున్నారు. గతంలో కూడా ఒకసారి సూయిసైడ్ అటెమ్ట్ చేశాడు... సమయానికి మా మా పని మనిషి చూడడంతో ప్రమాదం తప్పింది'' అంది బాధగా సరోజ.

''ఎక్కడైనా ట్రీట్‌మెంట్ తీసుకున్నారా?'' అడిగారు ఇన్‌స్పెక్టర్.

''ప్రశాంత్ కుమార్ అనే డాక్టర్ దగ్గర తీసుకున్నారు'' అని ఆయన వివరాలు చెప్పింది సరోజ.

ఒక పక్కకు వెళ్లి డా.ప్రశాంత్ కుమార్‌తో ఫోన్‌లో మాట్లాడారు ఇన్‌స్పెక్టర్.

''ఆయనకు డిప్రెషన్ ఉన్న మాట నిజమేగానీ... ఆత్మహత్య చేసుకునేంత తీవ్రత ఏమీ లేదు. గతంలో మాత్రం ఒకసారి ప్రయత్నించారు, అంతే. ఈమధ్య ఎక్కడో కనిపించినప్పుడు చాలా హుషారుగా కనిపించారు. అయితే తనకు, భార్యకు మధ్య ఏదో విషయంలో తీవ్రంగా గొడవలు జరుగుతున్నట్లు చెప్పారు. భార్య సోదరుల నుంచి తన ప్రాణాలకు ముప్పు ఉంది అన్నారు. అయితే ఈ మాటలను నేను సీరియస్‌గా తీసుకోలేదు'' చెప్పారు డా.ప్రశాంత్.

''చూడపోతే రవికిరణ్‌ది ఆత్మహత్య కాదు... హత్య అనే విషయం అర్థమవుతుంది. కానీ సూయిసైడ్ నోట్‌లోనేమో ఆయన సొంత దస్తూరి ఉంది....'' అని కానిస్టేబుల్‌తో చెప్పి సిగరెట్ ముట్టించారు ఇన్‌స్పెక్టర్ నరసింహ. ఆ తరువాత మళ్లీ ఒకసారి లోపలికి వచ్చి శవం వైపు చూశారు. సూయిసైడ్ నోట్‌ను దగ్గరికి వెళ్లి పరిశీలించారు. అంతే....

''ఇది ఆత్మహత్య కాదు...హత్య...'' అన్నారు ఇన్‌స్పెక్టర్.

ఇప్పుడు చెప్పండి...

సూయిసైడ్ నోట్ చూడగానే...'ఇది ఆత్మహత్య కాదు' అని అని ఇన్‌స్పెక్టర్ ఎలా చెప్పగలిగారు?



### ఇక్కడ

శంకర్రావు హత్యకు గురయ్యాడు.

'తన పనేదో తాను చేసుకునే శంకర్రావుకు శత్రువులు ఎవరు ఉంటారు?'

'అతడిని చంపాల్సిన అవసరం ఎవరికి ఉంది?' ఎక్కడ చూసినా ఇలాంటి మాటలే వినిపిస్తున్నాయి.

శంకర్రావు హత్య పోలీసులకు సవాలుగా మారింది. ఏ కోణంలో దర్యాప్తు చేసినా శంకర్రావును చంపింది ఎవరు? అనే దానికి సంబంధించి క్లూ అందడం లేదు.

శంకర్రావు ముగ్గురితో చాలా సన్నిహితంగా ఉండేవాడని దర్యాప్తులో తెలిసింది.

1. కేశవ్... బ్యాంకు మేనేజర్.
2. రమణ.... లెక్చరర్.
3. మూర్తి.... చాలా కాలం పాటు కువైట్‌లో ఉన్నాడు. ఇతడిని 'కువైట్ మూర్తి' అంటారు. ఇప్పుడు నగరంలో వ్యాపారం చేస్తున్నాడు.

హంతకుడికి సంబంధించి క్లూ ఏమైనా దొరుతుందేమోనని గది మొత్తం వెదికారు.

మృతుడికి కొద్ది దూరంలో చుట్టగా చుట్టిన న్యూస్‌పేపర్ ఒకటి పడి ఉంది. ఆ న్యూస్‌పేపర్‌ను చూసీ చూడడంతోనే హంతకుడు ఎవరో కనిపెట్టారు ఇన్‌స్పెక్టర్.

ఆ 'న్యూస్‌పేపర్' హంతకుడిని ఎలా పట్టించింది?

**అద్దంలో ఆన్సర్**

కుడివైపు నుంచి అద్దం పెట్టుకుని చదవండి

